శ్రీరస్తు

# ప్రతిజ్ఞాయాదవము

అను

# సాంబవిలాసము

అయిదంకముల నాటకము

గ్రంథకర్త

శ్రీయుత అయినాపురపు సుందరరామయ్యగారు

ప్రకాశకులు

వి. పి. చంద్, అండ్ కో; బుక్ సెల్లర్సు అండ్ పబ్లిషర్సు

బెజవాడ

మొదటికూర్పు 1000 ప్రతులు

రాయవరం శ్రీ మేరీ ముద్రాక్షరశాలయందు మల్లిడిసత్తిరెడ్డిగారిచే

ముద్రింపఁబడియె.

౧౯౨౩

# ఇందువచ్చుపాత్రములు

దుర్యోధనుఁడు. హస్తినాపురమునకు రాజు.

దుశ్శాసనుఁడు }
దుస్ససేనుఁడు } దుర్యోధనునితమ్ములు.

కర్ణుఁడు. అంగరాజు.

శల్యుఁడు. మద్రరాజు

శకుని. దుర్యోధనాదులమేనమామ.

సైంధవుఁడు. సింధుదేశపురాజు.

కుమారజయద్రథుఁడు. సైంధవునికొడుకు.

లక్ష్మణుఁడు. దుర్యోధనునికుమారుడు.

భీష్ముఁడు. దుర్యోధనాదులపితామహుఁడు.

ద్రోణుఁడు. అస్త్రగురువు.

శ్రీకృష్ణుఁడు. ద్వారకకు రాజు.

బలరాముఁడు. శ్రీకృష్ణునియన్న.

సాత్యకి. రామకృష్ణులతమ్ముఁడు.

నారదుఁడు. దేవఋషి.

మన్మథుఁడు. శ్రీకృష్ణునికుమారుఁడు.

సాంబుఁడు. డిటో. కథానాయకుడు.

## స్త్రీలు

లక్షణ } దుర్యోధనునికూఁతురు. కథానాయకి.

భానుమతి. దుర్యోధనునిభార్య.

దుస్సల. దుర్యోధనునిచెల్లెలు.

శ్రీరుక్మిణి. శ్రీకృష్ణుని పట్టమహిషి.

జాంబవతి } శ్రీకృష్ణుభార్య. సాంబునితల్లి.

శ్రీరస్తు

శుభమస్తు—అవిఘ్నమస్తు

# ప్రతిజ్ఞా యాదవము

అను

## సాంబవిలాసము.



### నాంది

ఉ. ఆలినిఁగూడి లక్ష్మి సొగటాలను నాడఁగ వెన్కనుండి కన్గ్
గ్రీలికి మూయ నిక్కటిక కేలులు కావె వహించ్చెనద్రి నం
చాలి గొనంగ నీకటిక చాచులకే తగునంచు నవ్వు గో
పాలుఁడు భక్తపాలుఁడు కృపామతి సభ్యుల కిచ్చు కోరికల్

(నాంద్యాంతరమున నటీ సూత్రధారులు ప్రవేశింతురు)

నటి—దేవా! నన్నింతం సభకింత యగత్యముగా రావించిన దెందులకు?

సూత్ర—చెలీ! చిత్రకల్పనా బంధురమగు నాటక మొకటి ప్రదర్శించుటకు.

నటి—(చెవులుమూసికొని) అబ్బబ్బ! ఏమినాటకములు? ఏమిలోకము? ఇప్పటినాటకము లరయు వారెవ్వరు? మరియు వారెవ్వరు?

సూత్ర—ఏమీ? ఎంత విసుగుగా బల్కుచుంటివి? ఇప్పుడీ దృశ్య ప్రబంధమునుజూచెడి వారలే లేరా?

నటి—ఓహో! తుమ్మాటికిని లేరు.

సూత్ర—అట్లయిన ఇప్పటి ప్రజలకేది రుచించును?

నటి—ఇప్పటివారికినవలలయందాశక్తి. కావునని కాలమునకు "నవల" యుగమని పేరు.

సూత్ర—"నవల" యను శబ్దమునకు "స్త్రీ" యనియర్థము కలదు. అందుచేనిది "స్త్రీ" యుగమనియూ వచించెదవు.

నటి—దేవా! అర్థములన్నియుఁ బెడర్థములుగా సమర్థించుచుంటిరే? వినుండు. దాని యభిప్రాయము. కావ్యకన్యకను బూర్వకవులు మూఁడు విధములుగా విభజించిరి ఒకఁటి "ప్రబంధము,, అనఁగా "పద్యకావ్యము" రెండు "నాటక" మనగా "దృశ్యకావ్యము,, మూఁడు "వచనప్రబంధ,, మనగా "గద్యకావ్యము"

సూత్ర—అయితే నీవిప్పుడు వచించిన "కావ్యము" లలో నవల అనే కావ్యమేది!

నటి—"గద్యకావ్యము" నకే "నవల" నావెలు, నోవెలు, అని నామములు.

సూత్ర—"గద్యకావ్యము" నకీక్రొత్త నామము లెచ్చటనుండి వచ్చినవి?

నటి—దేవా! హూణభాషయందలి "గద్యకావ్యమును నావెల్" యని పిలచెదరు. దాని నుండియే యిప్పుడు నేవచించిన శబ్దములు వెలువడినవి.

సూత్ర—సరిసరి. (శిరము పైకెత్తి) ఆమఱచితి. ఏకారణముచేత దృశ్యప్రబంధమునువిను వారు కనువారును లేరంటివి?

నటి—ఆర్యా! కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగముపోయి కలియుగమెట్లేగు దెంచినదో అట్లే కావ్యయుగము దృశ్యకావ్యయుగము పోయి "నవల" యుగ మొకటి క్రొత్తగా వచ్చినది. వినుడు.

ఉ. కావ్యయుగంబు కృష్ణవిభుకాలము, మొన్నటి దాక దృశ్యన
త్కావ్య యుగంబు, నిన్నటి లగాయతు నావెల నంగనొక్కటౌ
నవ్యయుగంబు వెల్వడెను నావెలనన్ జెవి కోసి కొందురే
ద్రవ్యము నావెలందు నవలందున నెంతవెలైన నీయరే?

కాబట్టి నవలయందెంత ఘనతయో నవలయందున కూడా యంత ఘనత కలదు. కావున నాటకము లెవరు చూతురు?

సూత్ర—(పకపకనవ్వి) ఓసీ! ఇదియా! "నవల" యుగము. చాలుచాలు. నీవు "నవల"వు కాన "నవల" ను నీవే మెచ్చుకొనుచుంటివి. దానిసంగతి విను.

క. భువి వార్తాపత్రిక లటి
కవనంబేయుగు "నవలల" కవనం బబలా
అవి చదివెద రొక మారే
యువియటులే చదివి యవల నేపడ వైతుర్.

కావున "వార్తాపత్రిక" వంటిది "నవల" యని యెఱుంగుము. నక్కన రెండు కావ్యము లట్టివి కావు. ఎన్ని సారులు చదివినను జదువవలెనని యే బుద్ధిని జనింప జేయును.

నటి—దేవా! ఈ "నవలల" గతియేమి? వీనిని జదువు వారెవ్వరు? వీనిని రచించెడి వారెవ్వరు? ఎందులకై వీనిని రచింపవలె?

సూత్ర—చెలీ! ఇప్పుడా విమర్శన మనకేల? అట్టి విమర్శనలో దిగినచో జాలమందికి మనముపహాసాలమగుదుము. అట్టిపనిసాధించుటకై కవికుంజరులేమిచేయుచుండిరో యెఱుంగుదువా? వార్తాపత్రికల మూలముననో, లేక మనచర్చవలనగలిగెడు ననూయవలన "విమర్శన" యనెడి గ్రంథమూలముననో పగసాధించుకొనుటకు నవల

—

కర్తలు ప్రారంభింతురు. మనకు రంధియేల?

నటి — దేవా! ఎప్పుడు నట్లు వచింపకుడు. ఇది
చెడ్డకానీ విమర్శన వచ్చినప్పుడిటు కొంద
జేరక మానరు. అందు మన పక్షమునం జేరు బుద్ధిమంతులు
దానిని సమర్థింపరా?

సూత్ర — అట్లయిన నీవింతగాం దడిసి తడిసి యడుగుచుంటివి కాన వినుము

చ. కవులకుం గావ్య సద్రచన కష్టము, వానిం గ్రహింపం గష్టమౌ;
అవి తరువాత నాటకము లల్లి కొకింత శ్రమమౌనుగాని పో
అవి చదువంగం గొద్దిశ్రమయౌ, నవలన్ననో? యంత సుల్వు కా
ర్యవనిని లేదు రోజొకటి వ్రాయగనౌ పఠియింపం జేలికౌ
అది యటుండనిమ్ము. కాలక్రమమున:—

చ. అవనిం గనంగ దేహబల మల్పము: బుద్ధిబలంబు నల్పమై
నవకపు పద్యకావ్యములు నాటకముల్ రచియింపం జాలకే
నవలలు వ్రాయంజొచ్చిరవి నాణెముం గూర్చనటంచు నాదరే
నవలలకే జనింపబడె నావెల కూర్పపఠించుటల్ చెలీ.

నటి — దేవా! అట్లయినచోం బూరుషులేల "నవలలు" వ్రాయవలె? పఠింపవలె?

సూత్ర — చెలీ! నీకర్థముగాలేదా నైపథ్యము నందలి విషయములు. అయినను బాగుగా విప్పి చెప్పెద వినుము. సరియైన బుద్ధిబలము, పాండిత్య ప్రకర్షణమున్న వారలు "నవల" లను రచించుటకు యోచింపరు. అది లేకపోవుటచేం గావ్య కన్యకను పద్యరూప మొందంజేయు కవిసత్తములు తమయభిప్రాయములందిముడ్పలేక తమకిచ్చ వచ్చినట్లు వ్రాయగలవచనములో నిముడ్పగలిగి "నవలలు" ప్రారంభించిరి. అవర్గళముగాం బ్రబంధములు వ్రాసినపండితోత్తములు నవలలను వ్రాసియుండిరా? ఇందులకుం దారార్కాణము పూర్వకవులే. వాని రుచి వానిసాదృశ్యమిా నవల కేల వచ్చును. తరువాత నానందమును గూర్చునది దృశ్యకావ్యము. ప్రబంధ కవుల కంటె యొకవాసి బుద్ధి బలమునందే కాదు పాండిత్యమునందుం గూడ తక్కువవారే యని వచింపనగు. అన్నిటి కంటె చివర దే "నవల" కథనము. దీని శోభిలపింది కవిత్వమందురు. ఇది ద్విపద కావ్యము కన్నను చప్పన.

ఉ. హత్తిన వర్ణనాతిశయ మందిన జవ్వని పద్యకావ్యమౌ
భిత్తిరి వృత్తచిత్ర పద భేషజ ప్రౌఢయె దృశ్యకావ్యమౌ;
సత్తువిహీనయౌ వచన జల్పని లోలయె గద్య కావ్యమౌ;
హత్తుగ గావ్య కన్యకను నాగతిగా విభజింప నయ్యెడిన్;

నీకుండిన తెలివితేటల ననుసరించి వైపద్యముల నర్థము లరయఁగలిగితివేని యందు దనేక చమత్కారములైన యోచనలు నీమనంబునకే పుట్టఁగలవు.

నటి—దేవా! పైకావ్యముల సంగతి బాగుగా నామదికిఁ దట్టులాగున వచించితిరి; గాని "ద్విపద" కావ్యమంటిరే దానిరక్తి యెటులుండును?

సూత్ర—ఓహో! నన్ను బాధించుచుంటివే. దానివిషయమై యీసభయందు వక్కాణించుటకు వీలులేదు. ఏమంటివా! కొంచెము పచ్చిగా వర్ణింపవలసి యున్నది. అటుల వర్ణించిన గొండెకిఁ గోపము రాఁగలదు.

నటి—దేవా! కోపమెందులకు? ఇచ్ఛగలిగిన వారలు చెవియొగ్గి వినెదరు. ఇచ్ఛలేని వారు వినరు. ఏదియెటులున్నను విషయము తెలిసికొనుట ప్రతివారికి నావశ్యకముగదా?

సూత్ర—సరే! అటులైన "ద్విపద" కావ్యము సంగతి యిదియని నాయభిప్రాయము.

కం. ముసలి బడుగు చెలి చాచుల
పసయుండని భంగి "ద్విపద" బంధము నందున్
బసయుంతునె? రసముండునె?
వస వస లాడుఁగటులుండు బ్రాహ్మల కబలా!

నటి—దేవా! తాము జవ్వని, ప్రౌఢయని కొనియాడిన పద్య, గద్య పద్యకావ్యములకు లోలయను గద్యకావ్యము సరిపోవలదనియింతసేపు చర్చించినయంశమును నొక్క పద్యములో నెగఁగొట్టెద చూడుఁడు.

ఉ. మవ్వపు వాక్సుధారసము మాటల సద్యమకంబులేని యా
జవ్వని ప్రౌఢకన్యకలు చాలుదురే? యమకంబునందు మేల్
మవ్వపు మాధురీ వచన మంజుల ధోరణి కల్గు లోలతో
నెవ్వతె యైన కన్నె నుడులింపయిసొంపు వహింపగా వలెన్

సూత్ర—(పెద్దపెట్టున నవ్వి) ఓసీ! ఇదియా! నీవును నొక కన్యకవై యుప్పుడు "జవ్వన ప్రౌఢావస్థలు మారి" "లోల" యవస్థ యందుండుటచే నీయవస్థకుఁ బోల్పఁబడిన "గద్యకావ్యము" ను నట్లు ఖండించితివి. అంతియె కాని వేఱుకాదు. ప్రస్తుతాంశమునకు విఱుగడము.

నటి—సరే! ఆర్యా! దీనిని యేనాటకమందురు? దీనికి గ్రంథకర్తయెవ్వఁడు?

సూత్ర—దీనిని "ప్రతిజ్ఞాయాదవ" మందురు. లాలుగోహారు, గూల్బకావలి, ముక్కర్జి యాదిగాఁగల నాటక గ్రంథకర్తయే రచియించెను.

నటి—ఓహోహో! ఇఁకఁ జెప్పనక్కరలేదు. ఏ తెలుంగుదు నాతని సంగతి. శ్రీయుత అయినాపురపు సుందరరామయార్యకృతముకాదా! రక్తి విషయములో ననుమానింప నక్కఱలేదు. నాకథనుడి వినుఁడు.

ఉ. ఎచ్చటి నీరసంబొ, మరియేకడ నెట్టి సుహృద్య పద్యమో
యెక్కడ నెట్టి గద్యమొ, మరెందున నేవిధమైన భావమో
చొక్కఁగఁ జూపు నేర్పితని సొమ్ము, ఒకప్పుడు దైవసృష్టిలో
గ్రక్కున లోటుగల్గితని కావ్యములందున లోటు రాదుగా.

సరిగా మొలచినట్టుగానే యితని కావ్యము లుండును.

(అంత తెరలో)

ఓరీ! దుర్మార్గా! ఎవఁడవురా!

ఉ. వ్యాజము పన్ని యేరు సరసందున లేని పసందుఁ గాంచి, రా
రాజు కుమార్తె, కన్నె, జవరాలను దొంగిలుటన్న నీకు నీ
రోజున జెల్లు నాయువు విరోధము చేకురె గొప్ప వారితో
భాజన దక్కు లక్షణ సుభాంగిని వే త్యజియించి పోవరన్

సూత్ర—చెలీ! ఆకేక యెవరిదియో యెఱుంగుదువా? సుయోధనుని [illegible]
జయద్రధునిది.

(మఱల తెరలో)

ఓరీ! తులువా! ఏమని ప్రేలుచుంటివి? విడిచి పెట్టుమనినా:—

ఉ. డంబపు మాటలేటికి విడంబనమా కురురాజు భ్రాతృవ
ర్గంబు కనంగఁ గొంటిని, గరాస! ననున్ మఱపొందినావొ నే
జాంబవతీ ప్రియాత్మజుఁడ సాంబుఁడ కృష్ణుని ముద్దుకుఱ్ఱ నా
డంబరముల్ వచింప వడలా మగవాఁడవె కొమ్మ కన్నియన్

నటి—దేవా! నాటకరంగమునకు పాత్రములు వెలువడుచున్నయవి. ఇంక నాలస్యమేటికి?
అదిగో శ్రీకృష్ణుని కుమారుండు దుర్యోధనకూఁతుతో [illegible]
వాఁడు. రండుపోవుదము.

సూత్ర—మంచిది.

(నిష్క్రమింతురు)



శ్రీరస్తు

# ప్రతిజ్ఞాయాదవము.

అను

## సాంబవిలాసము

### ప్రథమాంకము — ప్రథమరంగము.

### హస్తినాపురమందలి బయలు

(రథారూఢుండై సాంబకుమారుఁడు లక్షణతోఁ బ్రవేశించును)

సాంబు — చెలీ! మన యరద మెంతపడిగాఁ బరుగెత్తుచున్నను, దాని వెంబడించియే నీ మేనయత్త కుమారుండగు కుమారజయద్రథుఁడు కట్టింపు వేగముతోఁ గాలి పనుగున వచ్చుచున్నవాఁడు.

లక్ష — దేవా! రానిండు. రానిండు.

సాంబు — ఆతఁడు తన పిక్కబలంబుకొలఁది పరుగెత్తుకొని వచ్చి మన తేరున కడ్డమై నిలిచెనేని వానివెంటఁబోవుటకు సమ్మతింతువాయేమి? ఏమంటివా?

ఉ. ఆతఁడు మేనయత్త సుతుఁడాతఁడు నీవును చిన్ననాట నుం
డాతతమైన ప్రేమ యొకరందున నొక్కరు కల్గియుందు; రా
హేతువు చేత నొండొరుల కెప్పుడు మోహము హత్తియుండనౌ
నా తెలికంబువాఁడనగు నాపయి నంతగ మోహ ముండునే?

లక్ష — ఓహోహో! దేవరవా రెంతమాట సెలవిచ్చుచుంటిరి?

ఉ. మేనతికంబె; యేమి? అదిమేనవె! యయ్యది యూడిపడ్డదే?
మానిని కిచ్చలేనియెడ మామ కుమారుఁడు తప్పడంచు నా
పైనను వేసి కట్టెదరె? బాగుసు నోగును లేదె? కాని, యే
మైనను నెవ్వరేమనిన మానము ప్రాణము మీదెగా వసన్

నాకభిప్రాయమే మీయెడ లేనెడల నాయనుఁగుఁగత్తియగు «ఇందుమతి»ని మీ చెంతకు బంపుటకు నాకవసరమేమిటి? మీగలప్పుడప్పుడు మీ జనకుండగు శ్రీకృష్ణునితోఁగాని మీ పెదతండ్రిగారగు బలదేవునితో గాని, మాపినతాత సుతు

లగు పాండవులతోఁగాని, మాయింటికి వచ్చినప్పుడు మీతో నాడుకొనుటయు నుద్యానవన విహారమునకు మీతోఁ బండిపై వచ్చుటయు, మీ చెంత భుజించుటయు నెట్లు మఱచుదును? అట్టి ప్రేమయే లేనిచో మనమైత్రత, మనయొజ్జయును చూచియే కదా? మా:—

కం. సాక్షాత్ జననీ జనకులె
లక్ష్మణ సాంబులకుజతి సలక్షణ మగుగా
నిక్షేపము గుండదె పెం
డ్లీక్షణమే యొనర్ప నెవ్వరేమందురొకో

అని యెన్ని సారులనుకొనలేదు మన యెదుట?

సాంబు—అప్పుడు వారలు మనయెదుట పల్కిన నేమి? ఇప్పుడు నీమనసాతని యందు దిలుగుటకు న్యాయమున్నయది. నీవెన్ని వచించి నప్పటికి:

ఉ. ఒక్కటె కంచమందుఁదిని యొక్కటె మంచము నందుఁబండి మీ
రొక్కటె బండిపైమఱియు నొక్కవనంబునకేగుచిల్లు మీ
రొక్క గదైనవీడకను నొండొరు లెప్పుడు సంచరింపరే
యక్కట! యట్టి బాల్య సఖునావిడి నన్ను వరింప నేర్తువే

లక్షు—ఎంతమాటాడుచుంటిరి? ఈయద్దమరేయిని మీకూడనరుదెంచినది ప్రేమచేతనా? గాక మతిచలించుట చేతనా? మాయిర్వురకును గల సంవాదమె యెట్టిదో వినుఁడు ఏను:—

ఉ. ఇంచుక భావనింగనిన నీసున సెట్టిక లెన్నొవిర్చి చి
ట్లించుక మోము, మూతి బిగియించుక నుండియు బిన్నవాటనే
కంచపు పొత్తుకోరఁగద కన్యకనై యలప్రాయమబ్బగా
మంచపు పొత్తుగోరుదునె మంచిదనైన నిటేల రానగున్

సాంబు—మంచిది మీబింకము నీపొంకమిప్పుడేమాచెద. అల్లదె నీబావవచ్చుచున్నవాఁడు

లక్షు—సరే రానిమ్ము.

(ప్రవేశము కుమారజయద్రథుఁడు)

కుమా—ఓరీ! సాంబా! నిలునిలు. నీయరదంబును పోనిత్తునా? (అడ్డుగా నిలచి)

ఉ. అంధుఁడవో మదాంధుఁడవొ యాదవ గొల్లఁడ నీకునెట్టి సం
బంధము లేనికన్నె, ప్రియ మాటలు కూతుఁరు నాకునీయ సం
బంధము నిశ్చయించినటి బాలను కాఁగలభార్య దాని గా
ఢాంధమునందు ముచ్చిలి చనంగనె పోనిమ్ముఁ బోవనిత్తునే

సాంబ—ఓహో! ఎంతమాట! ఎంతమాట!

ఉ. అంధుఁడగాను నాలరి మదాంధుఁడ నంతకు మున్నె కాను, సం
బంధము నీకుఁ గాఁగలుఁగు భార్యకు నాకునుగల్దు, మార సం
బంధమునెండి ప్రాఁడిముడి బంధము నిర్వ్యర నంటఁగట్టి ని
ర్బంధముఁ జేసిగా, నదియె బంధము దొంగిలఁజేసె కన్యకన్

కుమా—లక్షణా! నీవు రారాజు కుమార్తె వై యుండియు, నొక సామాన్యుని వెత్తి గొల్లవానిని వాసించుట మేలా? సిగ్గులేదా?

కం. కులముఁగల రాచకన్నెవు
కులహీనునిఁ గోరెదేల కులమా? బెలమా?
లలనా! యీవేళతో సరె
కలకాలముఁ జేయువట్టి కాపురమబలా

నేనన్ననో మేనత్తకుమారుఁడను, చేతికిని మూతికిని యెంగిలి లేని వాఁడను, బాల్యసఖుఁడను. చాలు రా! రా! యీపాటికి

లక్ష—ఓహో! మన మేకులము గలవారము. పాపము. మనకును యాదవులకును బాంధవ్య మున్నదా? రామకృష్ణుల చెలియలను మా ధనంజయున కివ్వలేదా? వేయేలా? నాయిష్టము. నీయట్టి:—

కం. వరహీనుని కిడుకంటెను
నిరవుగ కులహీనుకైన నిడి కన్యకనున్
బరిణయ మొనరించుటయే
సరసంబని పెద్దలాడు సామెత వినవో

ఆసంగతి యటుండనిమ్ము.

సీ. అందమా! నాయందు నొందవెన్నవ వంతు, చదువుకా! నాకంటె కొదవల్లాసు
చతురతా! నాలోన సగమైన గనరాదు, ధనముకా? నన్నట్టి వుచెలిగాడు
బుద్ధికా! నాకన్న బెద్దవాఁడవుకావు, ఈఁగికా! నాతోటి సాగిరావు
తెగువకా! నన్మించు మగువవేయగుదువా, పొడవుకా! మోకాలి కడకురావు

తే. గీ. ఇందు నన్నతమాడినది నే నేదికలదొ
ప్రేలుమడఁచి ఫలానిది లేదటంచు
ఖండితంబుగ వచియింపఁ గలవె బావ
లేనిపోని దురాశ నాపైని వదలు

సాంబ—(స్వగతమున) బళే! మంచితమాషగ జవాబొసంగుచున్నయది. ఇంతగానిర్మొగమాటముతో వచించుట నాయందలి యనురాగమే కారణమై యుండును. (ప్రకాశముగా) ఆ. ఆ. చెలీ! ప్రేయసీ! సఖీ! నాతమ్ముని యెంత మాటాడుదుమంటివి.

ఇంత సాహసము నీకుఁదగునా? తమ్ముఁడా! సైంధవేయా! ఊరకుండెదవేమి?

లక్ష—దేవా! జాంబవతీనందనా! ‘‘మేనత్తకుమారుఁడు మేకలమందలోనికుక్క’’ యను సామెత వినలేదా? అందుచేతనే సెంతవిరసముగా బరియాచకిమాడినను మాబావకు గోపములేదు. (కుమారజయద్రథునితో) బావా! అంతియేకాదా? నీకు నేనుగాఁగల ప్రేయసినై, మేనమామ కుమార్తెనై యుండగానన్ను వెన్నుని కుమారుఁడు చెలీ! ప్రేయసీ! సఖీ! యని పిలుచుటంగని యూరకుండుట భావ్యమా? చేతగాని తనమా?

కుమా—ప్రేయసీ! అట్టిప్రేమయేకలదేని నాయందు సాంబునిగేంబుని లెక్క చేయుదునా? ఓరీ! సాంబా!

కం. నాచెలి నాప్రేయసి, మరి
నాచేడెను నపహరించి నాదయె లేకే
నాచెలి! నాసఖి! యనియెదో
వాచాటా నోరుమూసి వదరకఁబోమ్మా

(లక్షణతో) నాయనుంగు గున్నా! రారమ్మా. అరదంబెక్కి యంతిపురంబునకుఁ బోవుదము (అని సాంబుని యరద మెక్కఁబోవును)

లక్ష— దేవా! కృష్ణనందనా! ఈతని తెల్వితేటలు కనిపెట్టితివా!

కం. ఎడమచెయిచేతనోటిని, కుడిచేమతియొకటి మూసికొని యావలకున్
వడిఁబోవక నేనాడిన, నుడులకు నిలచునోకోటీక నొగితెలిసున్నన్

సాంబ—ఓరీ! నరపశువా! దానిమాటలేమైన నీకర్థమయినవా ? అది నిన్నుఁబ్రేమించుట కాదు నీకుఁదాటియాకులు కట్టుట మొదటనిన్ను బలికినపల్కులు జ్ఞప్తికిఁదెచ్చుకొనుము.

కం. ఏనాఁడుఁజచ్చినావన, గీనాటికి నారుసెలలకిత్రమే యనుచున్
బోసేరకయావలికిని, నేనేమగవాఁడననుచు నిలచెదవిటఛీ
పోపొమ్మ (అని గెంటును)

కుమా—(క్రిందపడిలేచి) సరే! ఇప్పుడు నన్నుయితేపడగెంటితివి కాని మాతండ్రిని గెంటగలవా? ఆతనిని బంపినీపని పట్టించెదద్వారకానగరమునకు దారిచూచుకొనుము.

సాంబు—(నిర్లక్ష్యముగా) ఊ, పోరా! నీవింతగామగఁటిమి చూపితివి, నీతండ్రి వచ్చి చూపిబోరగిలపడెఁడు, నన్నుకొట్టినకొట్టితివిగాని మావానిని గొట్టునీపస తెలియును ననెడికోమటిపలుకులు నలెనున్నయవి పోపో.

కుమా—లక్షణా! నీనైజలక్షణము పోగొట్టుకుంటివి కావుకదా?

కం. జారుని కైయాసించుక, జారిణిజారుసెనసి, తన సామినదచున

ట్లారయ, పరాయినిఁగలసి, గారపునీమేనబావఁ గసిమసగెదవే
కానిమ్మా. పట్టుపట్టి నిన్నేయుద్వాహమై నీపనిమట్టు పెట్టకున్న నేసింధునరేంద్రు
నిపట్టినిగాను, నన్ను నాపేరన బిల్వవలదు.

(అని నిష్క్రమించును)

లక్ష—దేవా! ఇక్కడికీపిశాచమును వదల్చుకుంటిమి. తరువాయి సంగతి యోచింతము.
త్వరితముగా నరదమును బోనింపు.

సాంబు—చెలీ! మంచిది. (అరదముతో నిష్క్రమింతురు)

---

## ద్వితీయరంగము

(హస్తినాపురమందలి వేటలోకబయట సైంధవుఁడు గజముమీఁద ప్రవేశించును)

సైంధ—ఆహా! ఎంతదూరము తిరిగినను సాంబునితేజు కాన్పింపకున్నయది. ఆశ్చర్య
మాశ్చర్యము. (గుండెలుపైఁ జేయివైచుకొని) అమ్మా! అది కన్నియకాదు. ఎంత
కైనను గుండెలుతీసిన బంటు. లేకున్నచో:—

తే. గీ. తండ్రినహి తల్లినహి గురుదైవమునహి
యంచు టింగురంగాయని యర్థరాత్ర
మందు పెఱవానితోఁగూడి యఱుగుబాల
యెంతకైనను నది జగజంతకాదె

ఆసాంబుని రథమే కనుపించిన నాబాణంబులచే వాని ప్రాణంబులు తీయనా?
(ఇటు నటుఁజూచి "ఆడఁబోయిన తీర్థమెదురయ్యె" ననుసామెతగతి సాంబుఁడు
లక్షణతో వచ్చుచున్నవాఁడు. రానిమ్మా.

(ప్రవేశము లక్షణాసాంబుల రథంబుతో)

సాంబు—చెలీ! నీమేనమామ యిటుగాచియున్నవాఁడు.

లక్ష—రథము నాపకపోనిండు. పరాక్రమములోఁగొడుకును మించినవాఁడేయగు తండ్రి

సైంధ—ఓరీ! సాంబా! నీకు బుద్ధియున్నదా లేదా?

ఉ. నాయది మేనఁగోడ, లిక నాసుతకాఁగలరాణి, యట్టిదా
తోయజనేత్ర కన్నె, పెఱతోయలి, నీగతి ముచ్చలింప, సి
గ్గయెడలేదె? లోకులు హసింతురు గెలియొనర్తురన్న మా
టేయది లేకపోయెనె, యిసీ! యదువంశ వినాశకారణా

సాంబు—(నిందాగర్భముగ) సందర్భములేని యసందర్భపు ప్రలాపనలు మిగుల చిత్ర విచిత్రములుగా నున్నయవి. ఆహా! ఏమయ్యా:—

చ. తనదగు కోడలంట, సుతుదారగునంట్రిక ముందు, నట్టిదౌ
వనితను, నెంతమాట గిలుబాడితినంట, ప్రజల్ హసింపరే
పని చెడి తాను బెట్టఁగల బచ్చలపాదును మేసిపోయె, మీ
కొనఁగల గేదివచ్చియని కుత్సితులాడెడు సామెతట్టుగాన్
చాలుఁజాలు సిగ్గులేక నన్నెగ్గులాడుచుంటివా? నడు నడు.

లక్ష—మామా! నేను నీకుమారున కర్ధాంగినిగా గావలసినది యని విధాత నానుదుటను మూఁడుపంక్తుల తీర్చి వ్రాసినాయేమి? ఆర్యులవచనములు వినవా:—

కం. కనఁ గాంతాకనకము లెవ్వని వలచునో వానివెంటఁ బడిపోవుఁగదే
వినుమింత కొకని సతిగా, జనియింపఁగ నీసుతునకు సతి నెట్లగుదున్
సైంధ—వలచుటకును బెండ్లియాడుటకు నీయిష్టమే నా?

లక్ష—కాపురము చేయుదానిని నేనై యుండునప్పుడు వలచుటకును పరిణయంబగుటకును నాకు స్వాతంత్ర్యముండదా? నీకేమి స్వాతంత్ర్యము నన్నాటంక బరుచుటకు నీవుగాని సాంబకుమారుని యుద్వాహమై కాపుర మొనర్పవుగదా? చాలుఁజాలు వచ్చినదారిఁబట్టు.

సైంధ—ఏమీ! ఎంత తెగఁదెంపుగామాట్లాడుచుంటివి? నేకాకున్న నీతలితంట్రులో?

లక్ష—ఆసమాధానము వారికిఁజెప్పెద. ఇప్పుడు నాకొందుల కీయూకదంపు సంభాషణ. (సాంబునితో) దేవా! రథమును బోనిండు.

సాంబు—ఏమీ! సింధురాజా! ఇఁకనైన బుద్ధివచ్చినదా? లేదా?

ఆ. వె. సగముఁ జచ్చినట్టుల మగువ మాటలకీవు
నోరుమూసికొమ్ము; నోరు తెఱచి
పలికితేని యింక బయలగు కంపంత
అవలకేగు వేగ నవలవిడిచి

సైంధ—(కోపముతో) లక్ష్మణా! అప్పుడే కన్నులు మీఁదికి వచ్చినవా?

ఉ. బాంధవ మెంచకుండఁ, దెగబారెడు గర్వముచేత నన్ను ని
ర్గ్రంధపు మాటలాడెదో, పరాయి మగండు లభించె నంచు నీ
యంధపు నమ్మికేమి? యతఁడా పొగచూర్చుట నిన్ను, దేహ సం
బంధపు మేనబావ, ప్రియబాల్యసఖుండును గాకఁ గన్యకా?

లక్ష—(నిరసనగా) పాపము. మేనరికపు సంబంధములుగల దంపతులే కాపురములు సరిగాఁ జేయుచుండుట, ఒకరియందొకరు ప్రేమాతిశయముఁ గలవారై మెలంగు

చుంటి. నా వైదికపు సంబంధములన్నియు మన్నుఁగొట్టుక పోవలసినవే? పరాయి మగండట? పరాయిమగఁడు, ఇంటిమగఁడు, అని యిద్దఱు మగలుందురా యేమి? మగువకు? చాలు నీపాండిత్యము. ఇఁక కట్టిపెట్టుము.

చ. అసలొకఁడుండె నామగఁడు నాతనివీడి పరాయివానితోఁ
బొసఁగుమనె పొందు నీకని సుబోధయొనర్చెదొ; పెండ్లిలేని యీ
కుసుమ శరీర కన్యకను గూడుమనె న్నోటికివచ్చినట్లుగా
మసరున నాడఁజొచ్చితివి మామవు కానెప మట్టు పెట్టమే

నా యొక్క కడపటి నుడి విను. నీకుమారునకు నాకు నేయిరెట్లున్న సంగతుల యందు నువ్యాఖ్యానము కలదు. కాపురవానికి నాకును బొసఁగదు. ఆసంగతులు విను.

క. ఆకారంబునఁగానీ, పోకేళికిఁగాని, జ్ఞానశుచులకుఁగానీ
నాకాలి గోరుపోలఁడు, నాకాకవాఁడేటిభర్త నగరే జనముల్.

ఇదివఱలోఁ బొఱబాటున నీసుతునకు సతినౌదునని తలంచియుండినప్పటికి నీపూటతో నాతలంపు మాని యావలకుఁ బొమ్ము. ఇచటనిలిచిన లాభము లేదు (సాంబునితో) దేవా! రథమును బోనిండు.

సైంధ—(అడ్డగాజని) లక్షణా! ఎంతలో నీబుద్ధి లక్షణము మాఱినది.

తే. గీ. అవని రారాజు కూఁతునై యవతరించి
ఎవ్వఁడీ ప్రపంచమున నీడేయనటుల
ఆలఁగాపరి సుతునకు నాలివైచు
గలిచేసెదు నన్ను; సిగ్గేల లేదొ;

సాంబు—ఓరీ! సైంధవా!

క. నీపాట్లు నీవు నొందక, నాపాటి యుతంతు లేదనఁ జొచ్చెద వీ
వేపాటి వాఁడవౌదువొ, నాపాటుల రాయ! రార జనమును జూతున్

చెలీ! నీమొగము జూచి వీని నుపేక్షించుచుంటి. నా ధనుర్బాణము లిటిమ్ము.

ఉ. వావి యొకింతలేక గను కావర మొంది మదించి ద్రౌపదీ
దేవిని బట్టనింగొనగ తెంపున మీసలు గడ్డమున్ దలన్
పావని నున్నగాగొఱిగి "పాండవ దాసుడ" వై చరించు మం
చావిధికంపె నావిధిగ "యాదవ దాసుని" జేసి పంపెదన్

లక్ష—దేవా! తొందరఁజెందకుఁడు. మామా! సింధునాయకా! నిన్ను నుడియించుట యొక లెక్కకాదు. మామేనయత్త దుస్సలకు వైధవ్యము చేకూఱునని విచారించుచుంటిమి? కాఁబట్టి మాతో నీకేమి! ఆవలకు వెడలుము. పూర్వపు సంగతి జ్ఞప్తియున్నదా? ద్రౌపదీ హరణావసరంబున ధనంజయుండు నిన్ను యమాగారమునకు

బంప యత్నింపగా మాధర్మనందనుని వచనంబులు:—

ఉ. నూరుగు రైదుగుర్వకును నొక్కతె చెల్లెలు; దానిభర్త నిం
పారఁగ జంపిసేని మనకై బ్రతికుండిన యంత కాలమున్
సారెలు చీరలిచ్చు ప్రతిసల్పిరవాధగనేర్చు దుస్సలం
చోరువ, నెంచి వీడఁగద నొయ్యన ధర్మజు ధర్మమాయనన్

మాతండ్రిగారి యుపదేశము నాహృదయంబున దగులుటంజేసి యిప్పటికి నిన్ను కరుణించి గాచితిమి. ఇఁక నొకొత్తక నావలనఁబోయిన మర్యాద దక్కను. పో పొమ్ము.

సైంధ— (మీసముదువ్వి) లక్షణా! ఇదిగో నాప్రతిన వినుము.

కం. ఏడా గోడము లాడెదొ, ఓడక సాంబుని రణమున నోడించి, నినున్
గోడలిగాఁగొని వదలకఁ గోడలికముఁ బెట్టకున్న కూళాయనుమా

ఇదే కర్ణ వికర్ణ గాంగేయ ద్రోణ శల్యాది వీరులతో వచ్చెద కాచికోఁడు.

(నిష్క్రమించును)

సాంబు— చెలీ! వీనిడాబు, పటాటోపము జూచిన నొకచేయిఁ జూపునాఁడేమో యని రోచించితి. మన శరప్రహరణ ప్రయోగముతోఁ బనిలేకయే పోయినాఁడేమి?

లక్ష— దేవా! తండ్రికొడుకులిద్దరును పోరాటమనిన పాఱుబోతులే రథమును త్వరగా బోనిండు.

సాంబు— మంచిది. (నిష్క్రమింతురు)

(తెర వాలును)

(వేఱొక మైదానము. హస్తినాపుర ప్రాంతము)

(సాంబలక్షణల యరదమును దఱుముచు కర్ణుఁడరదముమీఁదఁ బ్రవేశించును)

కర్ణు— ఆగుమాగుము సాంబా! వీఁడు కర్ణుఁడని యెఱుంగవా?

ఉ. సాంబా! ఆరేదురాత్ముఁడే నిశాసమయంబున నిద్రనున్న, ఆ
యంబుజనేత్ర నెత్తుఁ? గెలుబాడితివా గజకర్ణు గాడ! నీ
డంబు విడంబనంబు మఱిడాంబిక మేను గనంగ నెంచి మా
ర్గంబున కడ్డువచ్చితిని కర్ణుని బారితొలంగిరేగదో

పాపము! సైంధవ, సైంధవేయులనుకొంటివా యేమి? నీపటాటోపంబునకుభయంపడి పాఱిపోవుటకు? వీఁడు కర్ణుఁడు కర్ణుఁడు కర్ణుఁడు.

సాంబు— (రథమునాపి) ఓయీ కర్ణ! ప్రలాపకర్ణ, మదించినలంబకర్ణ! దీర్ఘకర్ణ!

ఉ. కర్ణ! హరించుటందు గజకర్ణ? సెబాసుర మాయయందు నో
కర్ణ! యదేపదింబదిగ కర్ణుఁడ కర్ణుఁడ నంచుఁ బల్కెదో

కర్ణుఁడనఁగ నేమి? మెయి కంపము నొందునె? భీతిచేత ఏ
కర్ణమునందుఁ జొత్తు? నెటకానఁగరాదు గదింక సూతజా

(అని కంగారు నభినయించును)

కర్ణు—పిడుగా! ఎంతవాఁడవైతివి? అమ్మా! లక్షణా!

ఉ. ఓకొమరాల! కన్యకా! యహో, యితఁడమ్మరో! తండ్రికంటె నా
రాకులు హెచ్చుగాఁజదివె నమ్మము! కృష్ణుఁడు గూటి గ్రుడ్లనే
యాకట సంగ్రహింప, నొడియందలి గ్రుడ్లను దొంగిలించు భ
ల్లూక సుతాత్మజుండు గజ్జములు ధర్ముండన నవ్వరే జనుల్
ఎంత మోహమున్నను లోకమునకై నా వెఱగొందకలదా?

లక్షు—తండ్రీ! అంగరాజా! నాతండ్రియగు సుయోధనుండు నీతో గలిపికదా తనకు నూరుగురు తమ్ములని వచించుచుండెడివాఁడు. అట్టి సోదర ప్రేమచేతనేగదా నిన్ను అంగదేశమునకు రాజుగా నొనరించె. ఆకారణమునుబట్టియే నాయందలి కుమార్తె భావముంచి నన్ను అమ్మా! తల్లీ! కూతురా! యనుచు ముద్దాడు చుండెడివాఁడు. కావున నన్నే నీకూఁతుగా నెంచి దోసలేయుఁడే నీమేనయల్లునిగా భావించి యాతని కీయమనిన నీవిచ్చెదవా? నిజముగాఁ జెప్పుము.

కర్ణు—అమ్మా! అతఁడు నీకీడు కాడెనియా!

లక్షు—ఓహో! స్పష్టముగాఁ గనఁబడుటలేదా?

కం. కాకుంటే గైదేడులు, నాకంటే పెద్దయగును నాకృతిలో నా
మోఁకాలంతయు లేడే, నాకా? అతఁడేటి భర్త నగరే జనముల్

ఏమింత గ్రహచారము? ఈడుగానివాని బరిణయంబై జంకను నెత్తుకొని తిరుగు మనెదవా? యేమి? లేక ఒడియందిడుకొని సంచరించుమనెదవా? ఇంతోటి చుట్టరికము పోవుననియా! నీయభిప్రాయము? ఏదీ వేలుమడచిచెప్పుము అతఁడు విలువిద్యయందు గాని, యాకారమునందుగాని, పాండిత్యమునందుగాని యేవిషయములో నాకు సరిపోలునో వచింపుము. ఆసంగతి యటుండనిమ్ము.

కం. మగువకు వృద్ధుఁడు భర్తగ, నగుటవలన సౌఖ్యమెంత యనుభావ్యంబో
మగువకు నీడును జోడును, నగుదెంచని భర్తయంటె యనుభావ్యంబా

తండ్రీ! నాకిచ్చలేని దాంపత్యమునకై నన్ను బలిగొల్పెదవేల? అబలనగుటవలనా? లేక స్వాతంత్ర్యములేని స్త్రీ జన్మమెత్తుట వలనా? ఏమీ! ఏదో కొంపమునిగి పోయినట్లుగా నరదంబుపై నన్ను వెతకుటకు నీయర్థరాత్రంబున రానేల? ఛీ; స్త్రీ జన్మముకంటె కాటికవిలోఁ బెనుమ్రాకై యుదయించిన బాగుండును. వెయేల? ఒక్కటివినుః

ఉ. ఈడును జోడు గాని యతి హేయముగా గనుపట్టు వృద్ధ పూ
బోడిని జెట్టఁబట్ట నెలప్రాయముఁడు పూరుషుఁ డొప్పునె? యదే
పాడిగ కన్నెసోయగపు వాని మనీషుని నీకువానితోఁ
గూడును గాని పూరుషుఁడు కూడెనటంచును గూడునే నృపా

కర్ణ—అమ్మా! నీమాటలు యదార్థములే. ఇప్పుడు నన్నొక వృద్ధాంగనను గూడుమనిన కూడదందునా? తారాజు నభిప్రాయము నేనెఱుంగుదు

ఉ. ఎంతయు దుస్సలేమ్మనని యింతకు మేనటికంబునాటు, భూ
కాంతుఁడు మేనబావకది కారణమా నిను పెండ్లిచేతు నం
టంతియె కాని వానియెడ లంతకుమించిన గొప్పలేదు, శ్రీ
కాంతునిపట్టి నీకుఁదగు కాంతుఁడనే కవిధాలఁజూడఁగాన్
వేయేల!

క. ఈడునకా? పోడిమికా? ప్రోడతకా? హొయలునందు పోల్పఁగ మీలో
దేడా కనరాదుగ మీ, జోడాతో సరియగు సమజోడా కననా

సరిగా మీరూపురేఖా విలాసంబులు కనువారికొక తల్లిగర్భమునుండి జనించిన కవలపిల్లల తీరుగా నున్నవారు.

సాంబు—(స్వగతము) ఆహా! యిదియెంతకైనా జాణయగును. కర్ణుని బుట్టిఁగోఁ బెట్టినది
(ప్రకాశముగా) అంగరాజా! నీవు బాగుగా నెంచితివి.

తే. గీ. చక్రవర్తికి ప్రియతనూజాత యగుట
చక్రధరునకు ప్రియ తనూజాతుఁడగుట
సరిగ నిర్వుఱ జనకులు చక్రధరులె
యగుట మాకవ చక్కగా నలరెసుమ్ము

కర్ణ—అమ్మా! లక్షణా! సుగుణ గణాలంకార లక్షణా! సర్వసౌందర్యయుత లక్షణా! నీమేనబావను:—

ఉ. బమ్మ సృజించుటందు పొఱబాటుగ నాలుగుకాళ్లు మారగా
నమ్మరొ! రెండుకాళ్లునిచి యావలకేదొ పనుండి యేగగా
నిమ్మెయి మానిసై భువి జనించెను నీదగు మేనయత్తగ
ర్భమ్మున నందువల్ల తమభర్తగఁ గాఁగల వాఁడనయ్యెగా

అంతయేకాని వేరొండుకాదు. నీమనంబునందుగల యూహను గనుటకై ముందుగా సాంబకుమారుని సెదిలించి పల్కితిగాని వేఱుకాదు. నీకును జయద్రథకుమారునకును హస్తిమశకాంతరము వ్యత్యాసముకలదు. నీయొక్కయు సాంబకుమారుని యొక్కయు:—

కం ఉజ్జీ సరిగాఁగుది యెను, విజ్ఞోడు పడంగఁజేయ విచ్చల విడిగా
నజ్జారే మీరేగుఁడు, ఖజ్జా నాకేల నమ్మ గమనించెదగా
(అని కర్ణుఁడు నిష్క్రమించును)

సాంబు—(గుండెలపై జేయి వైచుకొని) ఆహా! చెలీ! యెంతదాన వెంతదానవు.

కం. సరియగు టంకపుపోళ్లను, సరియగు పడికట్టు బొమ్మ సమ కూర్చుటలో
సరియగువారలు నీతో, సెఱజాణా! కానసెందు సెఱజాణవెకా

లక్ష—దేవా! ఏమిచేయను. ఈకర్ణపిశాచముతోఁ గయ్యంబునకు గాలుదువ్వుటయుక్తముకాదు. మన వ్యవహారమునకు జిక్కురానగు:—

సాంబు—అవును నీమాట సత్యమే. వాఁడు మనతో సంగ్రామ మొనరింప కుండఁగ నేగుటకు మఱియొక యూహ యాతని డెందంబున కలదు. అది యెద్దియో చెప్పఁగలవా?

లక్ష—ఓహో! ఆమాత్రము గ్రహింపలేనా? వానియుద్దేశము వినుండు.

ఉ. ఊరక, యూసుపోక నినునొయ్యన మాటకుఁ బొమ్మనంగ, కం
గారొనరించి యాల్మగలఁగట్ట తలంపున దుర్మదాంధ కం
గారొనరింతువే యనుచు ఘ్మోవిభుఁడాడున సెండియూహతో
జారెను భావికార్యకృతి చర్చ యొనరించిన వాఁడు కావునన్

సాంబు—చెలీ! బలే! పసందుగా యోచించితివి. ఇదిగో యరవంబును తూర్పుదెసగా బోనిచ్చెద. (నిష్క్రమింతురు. తెఱవాలును)

(హస్తినాపురప్రాంతమందలి వేఱొక యరణ్యము)
(గజారూఢుఁడై లక్ష్మణకుమారుఁడు ప్రవేశించును)

లక్ష్మ—సాంబుని చారిత్రమెంత విచిత్రముగా నున్నయది. అగును సాంబు ననసేల?

ఉ. చేదొకో? మేల్పసందయిన చేడియ, జవ్వని, రాచపట్టి యే
మీఁదికిఁ బోయి పూరుషుని మీఁదబడంగ స్వయంవరాత్మయై
కాదని బొమ్మవంగఁలఁడె కన్నెపయింగనువైచి వేచి వీ
లేదయినన్ లభించిన హరింపఁ దలంపున నున్నవాఁడిలన్

కావున వాని నిందింపరాదు. మన బంగారము మంచిదైయైన నగసాలిని దిట్టనేల నాచెల్లెలి మనసునందేకల్మషముండని యెడల నోరులంటఁగలరా? కన్నెత్తిచూడఁగలఁరా? (తలపంకించి) ఈవిషయములో దానిని గూడ నెపబెట్టుటకు వీలు లేదు. ఏమన?:—

ఉ. మేనటికంబనంగ నొక మేటి నెపంబున లక్షణాంబకున్
మానుగఁ బెండ్లిచేసగు, కుమార జయద్రథు నంతెకాని, పెం

పూనిన శక్తియుక్తులకుఁ బోలఁడు దానికి, సాంబుఁడన్న, స
న్మానిని నాదుచెల్లెలికి సమానుఁడెగాఁ బ్రతియంశమందునన్

ఇదియును గొంతయోచింపఁదగ్గదే. మాచెల్లెలి యభిప్రాయమును బట్టినడచెద.

(ప్రవేశము లక్షణాసాంబులరదంబుపై)

సాంబు—చెలీ! అదిగో స్వయముగా మీయన్నయే గజంబుపైఁ బ్రవేశించినవాఁడు.

లక్ష—దేవా! వానిమనసు నొప్పింపకుండగా మనమిర్వురము మాట్లాడవలె.

సాంబు—చెలీ! అట్లనే మాట్లాడెద. ఇదిగో సమీపించినారము. ఓహో! బావగారా!

ఉ. ఏరలా! లాఁతివారలిట కేగుటకేమి యటంచు నెంచితిన్
మీరౌనా! మీరెగా! యహహా మీరలె! ఓహొహో మీరె! మీరె! నా
కూరిమి రాణికగ్రజుల కుంఠిత తేజులు బావగారె! జో
హారులొనర్చె మీచెలెలి యాత్మప్రియుండు ముదంబుతోడతన్

లక్ష్మ—ఓహో! బావగారికి వ్యవహారము మీఱినది. ఇది యెప్పటినుండి? ఎప్పటినుండి యననేల? ఇప్పటినుండియే ఏమనగా:—

ఉ. మీఱిన రూపుసంపదల మీఱిన బుద్ధిబలంబు నన్నిఁటన్
మీఱిన మీశిరంబుపయి మీఱిన కన్నె లభించె, నందుచే
మీఱె విలోచనంబులకు మేల్బధిరంబు, శ్రవంబులందు చ
త్వారముగన్గె విన్కి యగపట్టుటలేదుగ బావగారికిన్

లక్ష. కం. అన్నా! చెల్లెలి జోహారు, మన్ననతోఁ గాంచిచెలెలి మానిని జయవే
ల్మన్నా. రావన్నా, నీ, కన్నా! ఆప్తవరులు భువిఁ గాంచఁగదన్నా.

లక్ష్మ—ఓహో! చెల్లయమ్మరావుగారా! నీకులక్ష్మణుఁడన్నగారనేఁడిష్టప్రియున్నదా? ఆహా! వలవఁబోయి వలవఁబోయి యెట్టి వానివలచితివి?

సీ. కులము బలములేని కులహీనుఁడగువాఁడు సిరియు సంపదలేకఁ జెలఁగువాఁడు
ఆకారమొక్కింతయైనలేనటివాఁడుఁ గుణరహితుండయి గొఱలు వాఁడు
స్థిరముగా నొకజోట బరగియుండనివాఁడు, రాజ్యభోజ్యములేకఁ బ్రబలువాఁడు
మాయతో వెన్నంటి మాయ నొందెడివాఁడు, మానాభిమానముల్ లేనివాఁడు

తే. గీ. అట్టి దామోదరుని పట్టిఁ జెట్టఁబట్టఁ
దలఁచినంతనె నన్నయుఁ దల్లిదండ్రి
యెల్ల బంధులమిత్రుల నెల్లమఱచి
రాత్రి యిలువీడి చనెదవే లక్షణాంబ

లక్ష—అన్నగారు అర్థములు పెడర్థములుగా మార్చుచున్నవారు ఏమీ చిత్రము?

సీ. కులమేమి? స్వభువున కిలయందు నెందున, సిరియేల తనభార్య సిరియెకాఁగ
ఆకారమున్నె? నిరాకారునకు నెందు, గుణహీనుఁడన నిర్గుణుఁడుకాఁడె
స్థిరమెగా? ప్రతిచోట బరగియుండును బె చిన్నె, రాజ్యమొక టె లోక రక్షకునకు
మాయెగా? తనరాణి మాయనొందక నెట్లు, మానముండునెయెందు మాన్యునకును
తే. గీ. అట్టి దామోదరుని పట్టి చెట్టఁబట్టఁ
దలఁచితివి నీగాని యన్నలతల్లిఁదండ్రి
నెల్ల బంధులమిత్రుల నెల్లమఱువ
రాత్రి యిలువెడలుట కేమి లక్ష్మణార్యః

లక్ష—ఓరీ! సాంబా! దుర్గుణకదంబ! డింభా! ఎంత పనిచేసితివి?

ఉ. బాల, కుమారి, కుఱ్ఱను ప్రపంచపు జ్ఞానమదెట్టిదేమొ? యే
గోల నెఱుంగనట్టి చినిగోలను, నింటఁ బడున్నదాని, బెం
బేలను బేలనిట్లు, నడివీధికిఁ దెచ్చితి చూడఁ జుట్టమై
శాలకుఁజేరి దయ్యమయి జవ్వనిపైఁ బడి కవ్వనెంతువే
పూర్తిగా నీసంగతి కనుగొనువఱకును పోనిత్తు ననుకొంటివా?

సాంబు—(నిర్లక్ష్యముగా) లక్ష్మణా! నీచెల్లెలకు పిశాచమైనేనావహింపలేదు. నీచెల్లెలే పిశాచమై నన్నావహించినది. పాపము నీచెల్లెలు బాల, బేల, గోలయనిదుర్భ్రమ పడుచుంటివి కాఁబోలు వినుము:—

ఉ. బాలఁట? యీజగద్విషయ భావమెఱుంగని దంట? వట్టి బెం
బేలట? గోలయంట? నడివీధికిఁ దెచ్చితినంట? పాపమీ
బాలకు పెండ్లిలేయయిన పాపల నల్వురగాంచి, పెండ్లిచూ
లాలయి బిడ్డఁగాంచుటకు నాయతమై సరిగుండ కుండునే
ఎంతపొఱబాటుపని యొనర్చితిని? ఇంటనున్నదానిని రచ్చకుఁదెచ్చితిని. చెలీ! లక్ష్మణా! అంతియేకాదు.

లక్ష—(చిఱునగవుతో) అన్నా! నాయందలి ప్రేమచే నట్లనుచుంటివి. ఒక్కమాటవిను

ఉ. చిత్తము, ప్రాణమానములు చిత్తజు భ్రాతకు ధారవోసి, నే
హత్తుగ వానివెంటఁదిరిగి తంతియె, యిచ్చయెలేక యున్న నా
యెత్తు ధనంబె కాదు నిలువెల్లను బంగరు పూఁతపూసినన్
వత్తునె? యిందుకై మనదె పాపము, బావను నిందఁజేసినన్

లక్ష్మ—అమ్మా! ఎంత పొఱబాటు వచించుచుంటివి?

కం. మేనటికము త్యజియింపుచు, మానిని పెఱవానిఁగోఱ మాన్యమె నీకున్
లక్ష. మేనటికమీఁడుకానెడ మానినికతఁడెందు కుత్త మాంగము నెక్కున్

లక్ష్మ—ఏమి! అతఁడీడుకాఁడా!

లక్ష—వయసునకు బెద్దవాఁడె. ఆకారమునకా మోఁకాలిపొడవులేడు. తెల్వితేటలకా? ఏమూలకును సరిరాఁడు.

లక్ష్మ—అమ్మా! బాలవగుటచే నట్లనుచుంటివిగాని "మేన" యను పదమ్ములో నెంతర్థమున్నదో వినుము "మేన" యనగా శరీర సంబంధమని అర్థము. అనగా నొక రక్తములోనుండి జనియించిన వారనిభావము. మేనబావ, మేనమఱఁదలు, మేనయత్తయున్న గుదురు. మేనులో నేభాగమునకు బాధకలిగినను మేనునకంతయు గలిగినట్లుండును కదా? అట్లే "మేన" సంబంధమగు సంతతిలో నెవనికిఁగష్టము వచ్చినను తక్కినవారలకుగూడ కష్టము వచ్చినట్లుగానే యుండును. అందుచేతే మనవారలుపరస్పర విరోధములుదాంపత్యములోఁగలుగవని యెంచి "మేనటికము" ముఖ్యమనిరి. కావున:—

ఉ. మేనటికంబు సాటినహి మేనస్వభావముగాజనించు, నం
దానను ప్రేమ యొక్క రొకరందున, అందున పిన్ననాఁటి నుం
డూనిన చెల్మి యిర్వురకు నొక్కగృహంబున నున్న మైత్రిచే
రాణయి మీదుజంటకు సరాఘరియౌనటి జంట యుండునే

లక్ష—అగ్రజా! ఈడును జోడును సరిగా గుదిరినపట్ల నీవచనంబులుయదార్థములే. కాని యట్టినోమును నేను నోమకొనలేదు. ఏమి సేయను.

కం. మేనటికముఁ జేయందగు, మానుగ నభిమన్యుళశుల మాఁకని సరిగా
నౌనన, ఉజ్జియు నుద్దియు, నౌనన మేనటికమట్టు లలరారవలెన్

లక్ష్మ—ఓహో! సౌభద్రాధనంజయులకు వెట్టిగొల్లల సంబంధము కలిగినందులకే విచారించుచుండ మఱల నెత్తి పైచీలవలె నీవెట్టిగొల్లనే యాసించవలెనా?

సాంబు—ఏమి! బావగారికి కన్నులు మీఁదికి వచ్చినవి? నీవన్నను అనకపోయినను మేము మీనెత్తిమీఁద చీలలమే. అనగా మీతలపైవారమే? ఏమన:—

కం. మాతండ్రి గదావిద్యను, మీతండ్రికి నేర్పెగాన మీతండ్రికి మా
మాతఁడ్రి గురువుగావున, మీతలపై వారమనుచు మెలఁగు మిటపయిన్
అంతిరయెకాదా! లక్షణా?

లక్ష—దేవా! అంతియెకాదు. ఇంకను గలదు. అన్నా! లక్ష్మణా! ఇంతకంటేయూడి పడిన సంబంధము దగ్గఱి సంబంధమేదికలదో వచింపుము. వీరలకు మనకు దండాగొండి మొదటినుండి యుండియున్నదే. అదియునుగాక, ఇది యొక ప్రేలువిడచిన మేనటికమువంటిది. వేయేల? ఇంతకంటె మనకుఁ దగిన బాంధవము వేఱొకటి లేదని నీచేతనే యొప్పించెద వినుము.

సీ. మగధ నాథునితోడఁ దగునె చుట్టరికంబు, ద్రవిడ రాష్ట్రాధిపు తగనివాఁడు
మత్స్య నృపాలుఁడు మనకు సామంతుఁడు, మాళవేంద్రుఁడు సరిజాలఁడు కద
నేపాళ భూపాలుఁ డోపునే మనతోటి, త్రైగర్తతోటి బాంధవము గలదె
సాళ్వ మహేశుఁడు జతకాఁడు నాకును, భోజ దేశవరుఁడు ముసలి బడుగు
తే. గీ. కొంకణ విభునిగుణములు వంకరకద
ఘూర్జర ప్రభు రూపము ఘూక రూపు
బర్బరావనిపుఁడు సుద్ద బండ యగును
ద్వారకాధిపు సుతు కంటె బంధు వెవఁడు?

తక్కిన వారలందు వేమో? పాంచాలురు మేనమామలు, సింధునరేంద్రుని పుట్టియే మేనరికము, కొంకణ విభుసుతుఁ డీడు కాడు, బంగాళ రాజులకును మనకును వైరము, లాట, మరాట దేశాధిపతులు స్వగోత్రీకులు ఇఁక నెవరున్నారు?

కం. కౌరవులకు యాదవులకు, వేఱేమిటి? బీరకాయ పీచుగతి నొ
ప్పారెకదా చుట్టరికం, బారయ ముత్తాత తాత లందున నుండినన్

ఇంతకంటె నొక్కి వక్కాణింపఁదగ్గ యంశము లేదు. నీవు నా క్షేమము కోరు వాఁడవు. కావున నాకడసారి నుడి వినుము:—

ఉ. అన్నవు తండ్రికిన్వెనుక నావుదు తండ్రిసమంబు, అందుచే
నన్ను గుఱించి బాధ్యత తనర్చును నీకును, అందుఁబట్టి యీ
వెన్నుని పట్టి నీకు నను వేయని దైవముఖంబుఁ జూచి నీ
వన్న త్యజించి వీనిపుడె వచ్చెద నీగజమెక్కి యింటికిన్

ఇదిగో సంసిద్ధముగా నుంటిని (అని లేచి నిలువంబడి) అన్నా! ఏమి సెలవు?

సాంబు—(స్వగతము) ఆహా! ఏమీ దీని టక్కరితనము. ఈసారి లక్ష్మణుఁడు డంగుపోయి మోము వంచుకున్నవాఁడు. వీని గడుసుదనమిప్పుడు తెలియవలె.

లక్ష్మ—(తెల్లఁబోయి) అమ్మా! లక్షణా! పూర్తిగా నీయభిలాష సాంబకుమారుని యందున్నదో లేదో యని నింతవఱకుఁ దఱచితి. నీయిచ్చయే నాయిచ్చ.

ఉ. లక్షణ కన్యకే విషయ లక్షణ మందున మేనబావ ప్ర
త్యక్షము కానుపింప నిసుమంతయు నీడును గాని యట్టి, లా
లక్షణుఁడేల? యీపనికి రానివివాహముఁ గూర్పఁ జెంచనే
యక్షతలేల నాశిరము నందున దాల్పవలెన్ బ్రజాళిచేన్

కావున నీయభిలాషయే దీర్చుకొమ్మ. నేనంతిపురికి వెడలెద. తక్కిన సంగతులు ద్వారకకు వచ్చి మాట్లాడెద. బావా! సెలవు. అమ్మా! వెడలెద.

(గజముతో నిష్క్రమించును)

సాంబు—చెలీ! (లక్షణ బుగ్గలుపొడిచి) లక్షణా! ఎంతకైనను తగినదానవే. ఎంతపనికు జేసితివి? నీవులేచి నిలువంబడగానే:—

కం. కల్లజడెంబపు నుడులని, యుల్లంబున నెంచలేక నుల్లము చెడి తా
తెల్లమతాబును గాలిచి, వెళ్లెడె నీయగ్రజుండు విమలేందుముఖీ

లక్ష—(కూర్చుండి) దేవా! ఏభూతమునకట్టి మంత్రము ప్రయోగించవలెనో ఆమంత్రము ప్రయోగించినగానివదలిపోవునా? రథమునుబోనిండు. మాతండ్రి లెదురుపడగలరు.

సాంబు— మంచిది. (రథముతో నిష్క్రమింతురు)

(తెర వాలును)

(హస్తినాపురప్రాంతమందలి వేటలోక బయలు)

(దుర్యోధన దుశ్శాసనులిరువురు హయంబులపై ప్రవేశింతురు)

దుర్యో—తమ్ముడా! దుశ్శాసనా! కృష్ణకుమారుడెంత మాయగలవాడు.

తే. గీ. గ్రద్ద లిన్నుకపోయిన గతిని అహహ
ముచ్చు పొద్దున నబలను ముచ్చలించి
యెత్తుకొని పోయెగా సాంబుడెంతకైన
అరితేరిన గజదొంగ యనగవచ్చు.

దుశ్శా—అన్నా! సుయోధనా! ఇందాతని తప్పులేదు. ఇదియంతయు మన లక్షణజ యొక్క పన్నుగడయే. ఏమంటివా?

తే. గీ. తరుణి కిచ్ఛలేనెడ పరపురుషుడెందు
తేరిచూడగలేడందు చూఱలాడ
గతడు గాదతని జనకుడతని తాత
యతని సృజియించిన విధాతకైన తరమె

దుర్యో—అవును. నీపలుకులు నిశ్చయములే. అదియునుగాక సాంబకుమారుడు తనకు దగిన వాడనియు నాతని పరిణయము జేసుకొనెద ననియు నాతడు మన యింటికరుదెంచి నప్పుడెల్ల మనతోనదేపనిగా బల్కుచుండెడిది. మేనత్తకు మన్న నసహ్యపడుచుండెడిది. చిన్న తనములో నటులాడినను పెద్దయిన పిదప బుద్ధి మారునేమో యని యెంచితిని. మారలేదు. అందులకు సాదృశ్యమిదియే:—

కం. ఎన్నగ బసియాటేడులు, కన్నెకు ప్రాయంబు బుద్ధికందటి మించెన్
జిన్నదె? చితుకదె? మూగదె? సన్నగ మాటాడకుంట సాంబుడు కొనగన్

ఇటులూఱకుండుటవలన నాతనియందు ప్రేమయున్నదనియే సూచించు చున్న యది. అంతియెకాదు తాను తటస్థముగా నూఱకుండుట:—

కం. అర్ధాంగీ కారమె యన్న, గర్థంబంగీకృతమని యందువలన తా

నర్థాంగియగుటె కోరిక, యర్థంబగు సాంబుక నెడి యర్థంబగుగా

దుశ్శా—ఆ హేతువుచేతనే యాతని వెన్నంటి యింటనుండి వెడలినది.

దుర్యో—అయితే! ముందుకర్తవ్యమేమి?

దుశ్శా—మనకుమా ర్తె యభిప్రాయ మెఱింగినగాని స్థితిపలుపఁజాలను.

దుర్యో—అదిగో! అవచ్చెడి తేరె సాంబునిదిగా యుండు.

(కొంతదూరములో లక్షణ సాంబుడు ప్రవేశింతురు)

సాంబు—చెలీ! మనమనుకొనిన తీఱుగా నీజనకులిచట ప్రత్యక్షమైరి. వీరలరెదుట

కం. మనబింకము, మనశౌర్యము మనవంకలు మనకుశంక మాటలకేఁక మీ
జనకులు లొంగరు సరికద, మనయాటలు పనికిరావు మానిని యిటఁపై
కావున నిందులకుఁ దగిన యోచన పన్నుము.

లక్ష—దేవా! కన్నతల్లిదండ్రులయొద్దనే కన్యకామణి యాటలు సాగకున్న నింకెవరియొద్ద సాగును? దీనికిఁ దగు ముఁదటికాళ్లబందము యోచించితి రథమును పోనిండు.

సాంబు—మంచిది. అట్లే పోనిచ్చెద.(రథముతో సమీపింతురు)

దుర్యో—(అడ్డుగా వెళ్లి) ఓరీ! సాంబా! కనులు కనుపించుటలేదా? రథమాపుము.

దుశ్శా—(అడ్డుగా వెళ్లి ) ఓరీ! నీతండ్రి సాంప్రదాయము చోరత్వమందు నీకు గూడ నలవడినదా? ఆపు. రథమాపుము.

సాంబు—ఓహో! తమరా! రారాజు యువరాజుగార్లా! మామగార్లకివే వందనములు

లక్ష—జనకులకిదే యభివాదనము.

దుర్యో—ఏమీ! అరదంబును మనుజులపై నుండియే పోనిచ్చుచుంటివే కనులు పోయి కన్వెనా?

సాంబు—మామా! మీనుడువేల కాదనవలె. యదార్థములే. ఏమంటిరా?

కం. మామయె రారాజగుటయు, మామక జననుండుమామ మామగుటయు శ్రీ
మా మానిని తల్లియగుట, మామా! కనఁబడునె కనులు మానిసి కెందున్

లక్ష—తండ్రీ! సుయోధనా!

కం. చక్రధరుపట్టి భర్తట, చక్రధరుండటట జనకుఁడుశ్వశురుండెన్నన్
చక్రధరుండట యికనా, చక్రాంగ గమనకుఁ గనులు సరిగ గనపడునే.

దుర్యో—అమ్మా! ఇంకా నీకతఁడు పూర్ణముగా మగఁడు కాకుండగనే వానిని వెన్కవైచుకొని మాకు సమాధానమిచ్చుచుంటివే? నిజముగాఁ బరిణయంబొనరించిన మామాట జ్ఞాపకముండునా?

లక్ష—తండ్రీ! నీమాటలు చమత్కారముగా నున్నయవే? పూర్ణపు మగఁడసంపూర్ణపు మగఁడని మగువ (అర్థోక్తి)

సాంబు — చెలీ! నీజనకుని వచన రచన నీకర్థముకాలేదు. నేచెప్పెదవినుము.

ఉ. పూర్ణముగాను సాంబునెడ మోహముఁజెందుట నీమనంబు, సం
పూర్ణపు భర్త సాంబుఁడని పూర్వమునుండియు బావయందు సం
పూర్ణప్రమోహముం గుటయు బొందుగ మేనత్తకంబు నోట సం
పూర్ణపు భర్తబావయని పోల్చెను త్వజ్జనకుండు ప్రేయసీ!

దుశ్శా — అప్పుడే వధూవరులయినట్టుగానే ప్రేయసీ యని యాతఁడు ప్రియాయని నీవు
ను బిలుచుకొనుచుంటిరే.

లక్ష — నాన్నా! పరిణయముతోఁ బనేమి?

కం. ఎప్పుడు మదియేపురుషుని, తప్పక వరియించునతఁడె తథ్యముగా స్త్రీ
కప్పుడె మనోహరుండగు, అప్పా! నేఁజెప్ప నేల? యదియె రివాజౌ

అందువల్లననే రాచకన్నియలకు స్వయంవర మేర్పడినది.

దుర్యో — నీయిష్టమేనా? మేనత్తకయూరకే పోవలసినదేనా?

లక్ష — తండ్రీ! నీకును నీచాదస్తమే కలిగినదా?

కం. మేనత్తకము, మేనత్తకము, మేనత్తకమటంచుఁబల్క మేరువొ? దివమో
ఓననఁబోడియూరక, పోనని యింతోటివావి పొందు మనెదొకో

దుశ్శా — అమ్మా! మాకు మాత్రము నీయందనురాగము లేదా! నీకుఁ దగిన వరునిఁగూర్చి
పరిణయంబొనరింప వలయుననుతలంపు లేదనుకొంటివా?

లక్ష — అట్టి తలంపేయున్నచో నింత రాద్ధాంతము సిద్ధాంతము లేల? ఇదివిను:—

ఆ. వె: తల్లినగలఁబెట్టె డల్లునికై గోలు
తండ్రి సాంప్రదాయి తనముఁగోలు
వధువదెప్పుడు మదిని వరునురూపతఁగోలు
వరునిఁగూర్చి యిట్టులఁ బరగుచుండు

దుర్యో — ఏమీ! ఈతఁడే నీకుఁదగిన వాఁడా?

లక్ష — నిస్సందేహముగా

సాంబు — చెలీ! చచ్చు తెగవేసి జవాబిమ్మా.

దుశ్శా — తలిదండ్రుల మాటలకతిక్రమింతువా? అట్లైన పాపము కాదా?

లక్ష — ఆహా! ఎంతమాట? ఏనెఱుంగనా? ఐన నీవిషయములోఁ బాపములేదు. ఏమన:—

కం. న్యాయముపట్టుల పాపం, బేయగుఁ దలిఁదండ్రిమాట కెదిరించినచో
న్యాయముపట్టుల పాపం, బేయగుఁ దలిఁదండ్రిమాట కెదిరించినచో

దుర్యో — (కోపముతో) తమ్ముఁడా! దుశ్శాసన! "సహవాస దోషే గుణాభవంతి" యను
నార్యోక్తి రిక్తయగునా? ఇది సాంబుని సహవాసము వలన మసల నెదిరించు

టకు సమకట్టితివి. కావున ముందుగా సాంబుని సాగదోలిన నిదేమిచేయుదునో చూచెద. ఓరీ! సాంబా! కౌరవు లసాధ్యులని యెఱుంగక అగ్నిలోఁబడు మిడుత చందంబున కినుకు మూసికొని మాలోఁబడి మాకన్య నపహరించ నెంచితివి. ఇదిగో నాశరజాలముచే నీశరీర ముదహించెద కాసికొమ్ము. లేక కొమ్మనిమ్ము.

సాంబు— (నిర్లక్ష్యముగా) సుయోధనా! మామా! వీఁడు కృష్ణ కుమారుండు.

ఆ. వె. సమరమన్న నడలు చావన్న జంకును
మాకెకాదు మాదు మందిరంబు
నందు తిఱుగు కుక్కకైనను లేదుగా
రమ్ము చేయిఁజూడ రమ్మమామ

చెలీ! లక్షణా! నీవు సారథివికమ్ము. నేను రథికుఁడ నయ్యెద.

దుర్యో—(కోపముతో) ఓహో! ఏమి? యీడాంబికము.

కం. నాకనులముందుపుట్టియు, నాకన్నుల ముందు పెఱిగి నన్నెదిరింపన్
నీకంటె తీసిపోదుమె, పోకిరి! రా రమ్ము నిన్నుఁ బోకాల్చెదగా.

తమ్ముఁడా! నీహయమును గూడ నాతో రానిమ్ము.

లక్ష—దేవా! తొందరఁజెందకుఁడు. తండ్రీ! తాళుము. మీ కేల పోరాటమవలె? (లేచి మధ్యగా నిలువంబడి) ఈపోరునకుఁ గారకురాలను నేను. కావున:—

చ. తలచి వరించి తెచ్చినటి వల్లభునిందెగనేయఁ జూడలే
నిలపయి కన్నతండ్రి వగు నీవు గతించిన కాంచలేను ముం
గలఁజన గోయి వెన్కజనగా నుయి, గావున నన్ను ముందుగా
సులువుగఁ ద్రెంచి నాపయిన జూపుకొనుండు బలా బలంబులన్

దుశ్శా—ఎట్టి దుర్మార్గుఁడైన తనకడుపున గన్న సంతును తాను జంపుకొన గలఁడా

లక్ష—ఎవ్వరులేరన నేల? ప్రత్యక్షముగా మీరలు కనుపించుచుండగా?

దుర్యో—అదియేమి?

లక్ష—ఏమని యడుగనేల? ఇంకను విప్పిచెప్పవలెనా? యేమి. అట్లైనవినుం.

ఉ. ఇమ్మెయి మంచి చుట్టఱిక మెచ్చట దల్లియుదండ్రి చూడకే
వమ్ముగ నాఱకొన్న యెడ ప్రాయము వచ్చిన కన్నె సాంప్రదా
యమ్మును, నీడుజోడుగల యాతని గోరుట తప్పె? ఆహహా!
"యమ్మతయుఁ బెట్టదంట యడుగ నడ్డుకుఁ గుడ్వగ నీయఁ" డన్నటుల్.

ఆసంగతియటుండనిమ్ము. ఇదిబాగుగా వినుము.

ఉ. మానుగ కన్యకే విషయ మందున నీడును జోడుగాని యా
మేనఱికంబు జేయుటకు మేకొను కంటెను నావలంతినిన్

బోనివకుండగా నడి సముద్రములోఁ బడఁ ద్రోయమేలుకా
దేని, యొకేటు రెండుతునె లీగతియౌనటు ద్రేసిచంపనౌ
ఇంతకంటెను సులువుగల మార్గమొకటికలదు. అది వినుండు.

ఉ. జోడును నీడు నెంచి మదిపోవను జోకను గాంచి యాపయిన్
నాడెము పోఁడె మెంచి జతనాణెముగా దగియుండు వాని, యే
వాడల నుండి నవ్వోతకి పట్టికి పెండిలి చేయలేని, య
వ్వాడు కుమార్తె పుట్టమెడ బట్టిక నుల్మియు గోత సేయనౌ
ఆపని వెంటనే యొనర్చిన నింతగష్టము లేకుండును.

దుర్యో—(చెవులు మూసికొని) హరహరా! ఎంతదారుణ మెంతదారుణము.

దుశ్శా—(ముక్కుపై వ్రేలిడుకొని) అన్నన్నా! ఎంతదౌర్జన్య మెంతదౌర్జన్యము?

సాంబు—(స్వగతము) ఈమాటతో నాడులు సగము పటుకు గ్రుంగినవి. అరఘడియ క్రిందట నున్న దురుసు, బిరుసు మెత్తబడినది.

దుశ్శా—సరే! నీకిచ్చలేని మేనతిక మటుండనిమ్ము. ఈతఁడే నీకుఁ దగినవాఁడా

లక్ష్మ—(స్వగతము) సరే! కొంతవఱకు దారికి వచ్చినవాఁడు (ప్రకాశముగా) ఈజాంబవతీ నందనునికంటె తగిన వాఁడెవఁడును లేడని నీచే నొప్పించెద.

ఉ. మాళవ రాజు కూళుఁడగు మత్స్యవిభుండతి మత్సరుండు, బం
గాళ నరేంద్రుడనంగ నత్రిగర్త నరేశుఁడు ధూర్తుఁడేను, నే
పాళుఁడరాళ వర్తనుఁడు బర్బర భూపతి దుర్బలుండు పాం
చాలుఁగ నెంచ వావియొకో సాళ్వ మహేశులు తుచ్ఛులే కదా.

మ. సుగుణుండే భగదత్తుఁడెన్న? గుణపూజ్యుండే జరాసంధుఁడున్
తగునే చుట్టఱికంబు భీష్మకునితో? దర్పుండె కాళింగుఁడున్
మగవాఁడౌనె శిఖండి? పౌండ్రకుఁడు సామాన్యుండె నీచాత్ముఁడౌ
పగవారేకద సూర్య సత్యజితు? లే వారింక నీడౌదురో?
ఫలానా వాఁడని వ్రేలుమడంచి చెప్పుము. యాదవులకుఁ గౌరవులకు తాత ముత్తాతల నుండి బాంధవముండలేదా? వేరేల? ఒకవంశములోనివారము కామా? ఇంతకంటె నూడిపడిన సంబంధమేది?

దుశ్శా—అన్నా! సుయోధనా? సర్వలక్షణ లక్షణయగు మనలక్షణపలుకులే నిక్కములు ఏమంటివా?

కం. తగు ధవుని మనము వెతకక, తగునేయది వెదకికొన్న ధవుపై మనము
జగడము సేయఁదలంచుట, ఖగవాహను పట్టికంటె కలరే బలులున్
మేనతికముతరువాత దగ్గఱసంబంధమిదియే. వేయేఁడులు తల క్రిందుగా బడి తపమొనర్చి

నేను నింతకంటె సంబంధము మనము తేజాలము. ఏమంటివా?
మ. బలరాముండు గురుండు, సాత్యకి ప్రియంబైనట్టి మిత్రుండెగా?
అలగోవిందుడు ముందుసాయమగు సాక్షాద్విష్ణుడేయౌ కదా?
సెలయల్లుండు మనల్లుడౌను యదు వర్నేతల్ సదా బంధులై
ఎలరారన్ గనువిచ్చి చూడగలరే యే వేల్పులైనన్ భువిన్.
దుర్యో—అట్లయిన నీయభిప్రాయము సాంబకుమారునకీయ వలసినదే నా?
దుశ్శా—ఓహో? కాకేమి? ముమ్మాటికి.
ఉ. ఇంటను దాచుకొంటకయి నేర్పడినట్టి పదార్థ మానొకో
అంటగ జవ్వనంబెవనికైన నొసంగకదీఱదందు, వా
ల్లంటి వరించు వానికివ కన్యలకిచ్చిన లాభమేమి? అం
దొంటిమి యాల్మగల్ నడుమ నొందిన నందు ననేక చిక్కులా
అదిసరికదా? ఇంక ననేకబాధలుకలవు వినుము.
ఉ. కన్నియ కోరుకొన్న విభుడాదని నన్యునికివ్వ దంపతుల్
కన్నడు హస్త దత్త జనియింపరు బిడ్డ, లొకానొకప్పుడున్
గన్నచో, వట్టిదుర్బలులెగా, ఇదటుండగ నొక్కవేళ యా
కన్నె మనంబు తప్పుతెరగంటిన నాపగ బ్రహ్మ శక్యమే?
సరియైన దాంపత్యము జతపడకయే వ్యభిచారదోషంబులు కలుగుట. మన మొకి
తికిం జెప్పువార మింతమాత్రము గ్రంహింపలేమా?
దుర్యో—అట్లయిన? దుస్సల రోదనమాపగలమా? బూడెదయెత్తి పోయ్యదా?
దుశ్శా—శక్తిన యన్నల కన్నెలలో దనకిచ్చ వచ్చిన దానిని దాని కుమారునకు బరిణయ
మొనరింతము.
దుర్యో—అందుల కొడంబడకున్న.
దుశ్శా—"అటునుండి నటకుకొని రమ్మనుగతిగా" ఆపై యోచింతము.
దుర్యో—సరే! అటులైనమనమిట నిల్చుట మంచిదికాదు. అమ్మా! లక్షణా! అబ్బాయి!
సాంబా! మేము వెడలెదము. జాగ్రత. తరువాత ద్వారకలోం గొదువసంగతులు
మాట్లాడుదము.

(ఇద్దరు సోదరులు నిష్క్రమింతురు)

సాంబు—చెలీ! ఆహా! యేమీ! త్వజ్జనకుండు:—
కం. అగ్గి పడుంబడి భగ్గని, గుగ్గిల మటుమండి పడుచు కోపోద్ధృతితో
నగ్గాదరించు గతిజని, తగ్గెనుగా నీదు వాక్సు ధార సమహిమన్
ఇంక గూర్చుండుము రథమును బోనిచ్చెద.

లక్ష—దేవా! ఆతఁడు నాకేమి కీడుచేయఁగలఁడు? కడపు చించుకొనిన గాళ్ళపైఁబడును గదా? ఇఁక మనస్వేచ్ఛ ఎవ్వరడ్డవచ్చినను లక్ష్యము లేదు. రథమును త్వరగా బోనిందు (కూర్చుండును)

సాంబు—మంచిది. (నిష్క్రమింతురు)

(తెర చీరపడును)

(హస్తినాపురమందలి వేఱొక బయలు)

(రథారూఢుండై శకుని ప్రవేశించును)

శకు—ఆహా! ఇదియొంతకైన జగజంత? కాకున్న నింతమందకన్నులలో దుష్ట స్త్రీ యర్ధరాత్రంబున, ప్రుచ్చుపొద్దున, మంచినిద్దుఱలో వేఱొక పూరుషునితో లేచి పోవునా? బళే! ఏమీ? దీనిసాహసము. చిన్ననాటినుండి యెఱుం దు.

కం. బలుటక్కులాడి బలుజాణత, బలుజగజంత బలాయారి బలుజిత్తులడా
భళిభళి దానితమాషా, బలారే వర్ణింపఁదరమె భళిరా! భళిరా!

ఏమో దీనిసంగతి చూడఁగ సాంబకుమారునితో మాత్రము కాపురము చేయునా? నాకుదోఁచదు. వయసు రాకముందే ఘడియకొక రకమైన ముస్తీబగుచు దోడివారిని యాక్షేపించుచుండెడిది. ఏమీ! దాని జ్ఞాన మత్యద్భుతము.

కం. ఒక యుక్తియందు కాదే, యొక విద్దెయు నందుకాదె యొకవిషయము గా
దొక సంగతి కాదిన్నిట, చక, చక, చక, విచ్చుకత్తి చందము మెఱయున్

(ఇటుఁ నటుఁ జూచి) ఓరీ! సాంబా! రథ గమనమాపుము. లక్షణా! రథమాపు చేయించెదవా? శరప్రహారణములు తగిలింపుమనియెదవా?

(తెరలో)

లక్ష—తాతా! నీకు శక్తికలదేని రథమాపుచేయుము. లేనియెడ పొమ్ము.

కం. మాటకు మాటయె కాదిక, ప్రేటనకున్ ప్రేటుకూడ వేసెదమిక పో
మాటము లేదు, రథము బ్యాహాటముగా నడుపుదేవ యూహైఁసనా

శకు—సరే! ఆపవద్దు. ఇదిగో శక్తియున్న నాపించెద.

(సాంబలక్షణలు రథముతో ప్రవేశింతురు)

లక్ష—తాతా! ఇదే యరదము. ఏదీ నీమగంటిమి?

శకు—సాంబా! లక్షణా!

కం. ఆపుఁడు రథమాపుఁడు మీ, పాపము బద్దలయికాదె పాపము మీరల్
నాపాలఁబడితిరేకద, నేపోనీవ కాలనల్పి నేలను రాతున్

సాంబు—చెలీ! వీనికిఁదగిన మొండిజవాబొకటిచెప్పి సాగనంపుము. అందుపైగదలకున్న పైసంగతి యోచింతము.

లక్ష—మంచిది. తాతా! నన్నుఁ గొనిపోయి నీమనుమనకుఁ బరిణయంబుగావించుకొను టకు సమకట్టితివా? (తలపంకించి) పాపము? ఎంతయూహ!

కం. దేవుండు వరమునిచ్చిన, నీవల పూజారి వరము నీయనిగతిగా
దేవసముఁడు తండ్రికొన, నీవేటికి యూరకొనవు నీచేతగునే

శకు—(కోపముతో) ఏమీ! లక్షణా! నీబుద్ధి లక్షణమెంతలో మాఱినది.

కం. ఎంతయు రాజ్యములేనటి, నుంతయి నాకులములేని సుద్దగరాసుం
డింతోటి మగఁడమరెనని, కాంతా క్రిందిరాయును మీదుఁ గన కుంటివిగా

లక్ష—తాతా! ఇంతోటిమగఁడంటివే? ఇంతోటిమగఁడనగా నెంతోటివాఁడు.

సాంబు—చెలీ! ఎంతోటివాఁడనగా మీతాతకువలె గడ్డము తల నెఱసినవాఁడు.

లక్ష—తాతా! అంతియేనా? లేక కుమారజయద్రథునివలె బండఁగావలెనా?

శకు—లక్షణా! ఎంతచెలంతుగా మాట్లాడుచుంటివి? చూడేమి చేతునో?

లక్ష—కాకేమి? చేసేది యుద్ధియా చేయుము. తాతా! ఎగిరి పడ నేల?

ఉ. జేంద్రఁ తెలుంగుతాత! తెగచిందులు త్రొక్కెదొ నన్ను గన్న మా
తండ్రియుఁ దల్లిపొందనటి తప్పిద మక్కట పాపమెక్కడో
తండ్రికి మేనమామకట తప్పయి "మూడయు నావునుండగా
కాంద్రని మధ్య కట్టుగవ గాడ్రెలె" నన్ను తెలుంగు నుండెగా.

శకు—ఇసీ! ఎంతలజ్జలేదే? ఎంతసిగ్గులేదే? "రారాజుకుమార్తె యఁట, ఎవ్వఁడు నీప్రపం చమునలేనట్లుగ గొల్లవానిని తగులొ్కని పోయెనఁట" అని లోకులు హసింతురని యెడి సిగ్గునకే నామనసెంతో దిగులొందుచుండ నిట్టి యకృత్య మొనరించెడి నీమనఁబెంత సిరింతనొందవలసి యుండునని యెంచుచుంటిని?

లక్ష—అట్టి లజ్జయే నీకుఁగలిగిన యెడల నీభూలోకంబును త్యజించి, మఱియొకలోకము నకుఁ బొమ్ము. నీవే వెడలరాదా యని ప్రశ్నింతువేమో నాకట్టి సిగ్గులేదు. వరిం చిన దానను నేను, కాపురముచేయుదానను నేను, నీవు వరింపవు కదా కాపురమా వీనితోఁ జేయవుకదా? నీకేల యిాకష్టము. పద పద.

కం. ఈతని నేవరించితి, నీతని నేగొలుకొంటి ఈతఁడె మగఁడా
ఈతని ముద్దాడెద నిదె, తాతా! నీతాత తోటి తగవొనరుదుమా.
దేవా! వేలుసు త్వరితముగాఁ బోనిండు.

సాంబు—మంచిది. (నిష్క్రమింతురు)

శకు—(ఆశ్చర్యముతో) ఎంత తెగువుగావచియించినది? కానిమ్ము. దీనిసంగతిగనియెద? దుస్సలను పురిఁగొల్పి రారాజు మనసు త్రిప్పించి కర్ణ, శల్య, భూరి, ద్రవ, భీష్మ గాంగేయులతో వీనినిదాకి పట్టుకొని చెఱసాలయందునిచి, లక్షణాకన్యకయొత్తి

పొడుపులు కనెద. ఎంత? ఈమాత్రపు పనియొనర్పలేమా. మాయా జూదంబున పాండవుల నోడించివారలరాజ్యలక్ష్మిని సుయోధనున కొనగూర్చెద నాటపోలె:-

కం. గీటును గీచని రాజుని దాటగ వలదన్న నతఁడు దాటునుగద వా
యాట లచట సాగవె? ఛీ, నాటకము మరి మిడిసిపాటు నణగింపద గా

(నిష్క్రమించు)

(యవనిక జారును)

---

గద్య పద్యము

మ.త్త. కాలు గజ్జెలు ప్రోవఁగల్లన గానమిచ్చుచు నాసికే
దాలమున్ లయి దప్పకుండగఁ దాండవం బొనరించు గో
పాల బాలుని పాద యుగ్మముఁ బాయకే మదినెప్పుడున్
లాలసుండయిఁ గొల్చుసుందర రామయాఖ్యుఁడు వ్రాసెగా





శ్రీరస్తు

# ప్రతిజ్ఞాయాదవము

అను

## సాంబవిలాసము



### ద్వితీయాంకము — ఘోరారణ్యము.

(రథారూఢులై సాంబ లక్షణ కన్యకలు ప్రవేశింతురు)

లక్ష — దేవా! జాంబవతేయ! నాయూహచే యోచింపగా నీసారి తప్పక ఘోరరణంబు జరుగునని యోచించెద?

సాంబు — అదియెట్లు? మీజనకులు సమ్మతించి యుండగాఁ దక్కిన వారికేల? యీ ప్రశంస.

లక్ష — మనకుఁ గట్టకడ యెదురు పడినవాఁడు శకుని అతని ప్రభావ మత్యద్భుతము.

ఆ. వె. మాయఁజేయుటందు మదిని విఱచుటందు
చేయరాని పనులు చేయుటందు
అతని యంత కఠినుఁ డవతరించునె భువి
శకుని గాడ్తెందు శనియెసుమ్మి

శనిగ్రహమునైనను దానములిచ్చి వదలించుకొనవచ్చును గాని, నీతని వదలించుకొనుట దుర్ఘటము. శని మనుజుని బాగుచేయకలదు, పాడుచేయనుకలగు, కాని వీఁడట్టివాఁడు కాఁడు. వీఁడెవనిని తుదముట్టలంచునో వానినిపూర్తిగనంతము జేయకగాని విడువఁడు. ఇందులకు తార్కాణము పాండవులే.

సాంబు — నీమాట యదార్థమే? మాయజూదము కల్పించివారల రాజ్యలక్ష్మిని మీతండ్రికి రావించుటయేకాక ఘోరారణ్యంబులకు బంపించినవాఁడు.

లక్ష — ఇప్పుడాశకుని ప్రయత్నమేదో యెఱుంగుదువా?

కం. అత్తయగు దుస్సలకుఁ దా, నెత్తులు కల్పించి యామె యెద నేగతినో
మెత్తపఱచి తద్ద్వారా, యుత్తమ మొనర్చు పిథమది నహో? విఱచుటకై

ఆపై మాయత్త గోలను జూడఁజాలక మాతండ్రి మదిని మఱలించు కొన్నవాఁడై మనయెదుట మనదాంపత్యమునకంగీకరించినట్టుగా నేయామెయెమెనుటనీకుమారునకు బరిణయంబొనరించుట కభ్యంతరము లేదని వచించును. అందుపై మనలను బట్టుటకై శకుని, సైంధవ, సైంధవేయ, కర్ణ, శల్య, భూరిశ్రవాదులు వత్తురు. నామాట యా వృత్తమేమో? అల్లదే చూడుఁడు కుమారజయద్రథుఁడెట్లు వచ్చుచున్నవాఁడో?

సాంబు—అవును. నిశ్చయమే. మఱల మీతండ్రి యిచ్చపడకున్న రాగలఁడా!

(ప్రవేశము కుమార జయద్రథుఁడు రథంబుపై)

కుమా—ఓరీ! సాంబా! ఇఁక నీయాటలు సాగవు.

కం. మాటలతోఁ బనిలేదిక పోటున కాయత్తమగుము పోకార్చినన్
జూటా! నా బోటిని ముమ్మాటికిఁ గొనిపోదు రమ్ము మగఁటిమి చూపన్

లక్షణా! ఇఁకనైనా నాతో వచ్చెదవా? ఇదిగో! విల్లునమ్ములు చూడుము.

సాంబు—లక్షణా! వీఁడీసారి లెస్సగా బొబ్బలిగిసినవాఁడే. వీనికిట్టిబలమేలరావలె.

లక్ష—దేవా! మాతండ్రిగారి యానతిచొప్పున వెనుకనుండి కౌరవయోధులు దెంపుటచే వారి యసరా చూచుకొని చెలరేఁగుచున్నవాఁడు. వీనిమదము నేఁడణంచెద. మీరలే చూచెదరు? ఓరీ! కుమారజయద్రథా!

సాంబు—ఏమీ! చెలీ! ఎంతచెడినప్పటికి మీబావయై యుండి, మేనత్త కుమారుఁడై యుండి, సింధుదేశమునకు యువరాజై యుండి, నీకుఁ గాఁగల గారాపుమగఁడై యుండఁదలంచిన వానిని ఓరీ! యనుట ధర్మమా!

లక్ష—దేవా! పొరపాటయ్యెను బావా! అంటినే కాదా? ఇందులకు క్షమాపణ మొక్క— శరప్రహరణ మాచరించినఁ జాలదా?

కం. ఆవేశముచే బావా! యావాహముఁ గోరి మమ్ము నాపుట్టకై ని
న్నావర్జించిన దయ్యము, నావలఁ దోలెదను నాశరావళి చేతన్
ఇదిగోఁ గాసుకొమ్ము (అని శరమును విడవఁబోవును)

కుమా—లక్షణా! ఆగు మాగుము. నీయబల గుణముచే నీవు నాపై శరములను ప్రయోగించినను నీపై నాయమ్ములను జిమ్ముట న్యాయమా కాదు. పైగ మనసాయొప్పదు.

ఉ. బాలవు మేనమామ మనుగు పట్టివి, బాల్యము నుండి యొక్కచోఁ
గాలము పుచ్చి, తిర్వారముఁ గాఁగల ప్రేయసి పట్టిదానిపై
చాట! శరాళి గుప్పుదువె సాహమొనరించి చిరుమూఁడు నెల్లుపో
మూలఁబడున్న యమ్మసలి ముద్దును గొట్టినటన్న సామెతా.

సాంబు—చెలీ! ఈయార్పులగొడ్డుతోఁ బ్రశంస గట్టిపెట్టి కౌరవసేన రాకమునుపే వీనిపని మట్టుపెట్టుము.

లక్ష—దేవా! అటులనే కావించెద. ఓయీ! సైంధవేయా! ఇంకా నీకు నాపై భ్రమ పోలేదా? ప్రేయసీ! యని పిల్చుచుంటివా! ఎంత సిగ్గులేదు? పోవలసినదని యింటనుండి కాలునుబట్టుక లాగుచుండగా చూరునుపట్టుక వ్రేలాడు నట్టులున్నది నీకథ. నీకగు నిన్నిపాట్లు నాకుగలిగెను. మేనతికమే తేమన్నయీయిక్కట్టు లేల?

ఉ. ఎట్టిలో బావతప్పునని యెంచి త్యజించి బిడెంబు, గేహమున్
గట్టిగ బాసి వచ్చినటి కన్నెను గోరుట లజ్జలేదె? ఛీ!
పట్టపగల్ కరంబునను బట్టుక లాగిన రాజకాంత యె
ప్పట్టున మాసరేతిరని వమ్ముగ నొకను సన్నచేసినన్
ఇదిగో బాణము ప్రయోగించుచున్నెదవా? లేక నెత్తినికొంగువైచుకొనిపోయెదవా?

(తెరలో)

జయద్రథకుమారా! భయంపడకుము. ఇదే కౌరవ సైన్యము వచ్చుచున్నయది.

సాంబు—చెలీ! మనమెంచినట్లయినది. ఈహయముల కళ్లెపుత్రాళ్ల నీయరద స్తంభములకుఁ గట్టి నేనుకూడ విల్లుతో సంసిద్ధుఁడనై యుండెద.

లక్ష—మంచిది. అటులనే కానిండు.

కుమా—లక్షణా! ఈసారి నీప్రతాపము చూపుము. ఏవీ మఱల బెదిరించుము?

లక్ష—ఏమీ! నీప్రతాపము. బెదిరింపక నాకుభయమా! కౌరవసేనయేకాదు ప్రపంచములోని వారందరేకమై వచ్చిన వచ్చుగాక. మాకు లక్ష్యములేదు. మూఢా! కాచుకొమ్ము. నీయెడ దయఁదల్పరాదు.

కం. అపరింపుల బెదరింపుల, కిది లక్షణయని యెఱుఁగవే లక్ష్యమొకో
పదిల పఱచు నీపని యెయ్యెడ్గది కరి పుర మనఁగఁ బారు కాడకఁ జేతున్
ఇదిగో శరద్వయము (అని రెండమ్ములు విడచును)

కుమా—రానిమ్ము. రానిమ్ము. (రెండు బాణములచే వాటినిఁ బడగొట్టి) ఓసోసి!

కం. భామిని నీశరములఁటే, నామీఁదికి వచ్చునంటె ననుఁ దాకునఁటే
యేమో వచ్చినకానీ, యేమాత్రము తగులనాకు నేమిటి నొచ్చున్

సాంబు—చెలీ! వీనితీంద్రము నీవడగించెదవా? లేక నన్నడగించ మనియెదవా?

లక్ష—దేవా! తాళుఁడు. వీఁడు నాకొఱకై యాసించుటచే వీని గర్వప్రాయశ్చిత్తము నేనే కావింపవలె. ఓయీ! దౌస్సలేయ!

కం. ఆసించి నన్నుఁగొన, ని న్నాసాదించిన పిశాచ మవలకనిపి నిన్
వేపారింపక విడచునె?, ఈసారి శరప్రయోగ మిదె కాంచగనౌ
ఇదిగో బాణపరంపరలు (అని ఒకదాని వెంబడి నొకటిగా విసరును)

కుమా—(వాటినన్నిటిని యుపసంహరించి) ఓసీ! ఏమీ నీశర సంధాన మహిమ.

కం. కామిని నీశరజాలము, కాముని సుమశరములయ్యెగా, నలంచు నెనక్
కాముకుండౌ సాంబునలంచు, నేమే! విలువిద్య మహిమ యేదనౌ కొంటిక్

చాలుంజాలు. ఇంక విల్లును విన్నువరించిన యాతుంటు విల్లు ననుజునికిమ్ము. నీతో నావంటివాండు సమరము జేయుట యెంత యపహాస్యమో యెఱుంగుదువా?

ఉ. సింధు నరేంద్రు పట్టియంట సింహ సమాన బలిష్టుండంట చాల్
గంధ గజేంద్ర గామినితో కయ్యము సల్పెనటన్న మాట ద
ర్పాంధులువిన్న తిట్టెదరు పండిత వర్యులు నవ్వనెంత్రు గ
ర్వాంధుండను సాంబు నజ్ఞగను రమ్మను పూరుషుండౌన? కాదొకో

సాంబు—చెలీ! ఏమీ? వీనిప్రలాపములు. నేను వంచనా? నీవువంచెదవా?

లక్ష—దేవా! తంనరం జెండనుంను. వీనికి నాచేత బాణగాండెలిసినుణు. చిన్న నాడే కాదు మున్నటివఱకు విలువిద్యలో నాకుం జాలక సిగ్గుపడి యున్నవాండు. వీని యోచన యెఱుంగుదురా?

క. అందుని చేం దన్నులుతిని, గాజిద యద్దాని నేల కామించెద వం
చాడెదరు బుధులనేండి యా, వ్రీడను సీగతిగ వీండు ప్రేలగంజొచ్చెన్

ఓరీ సైంధవేయ! నేనుప్రయోగించినవి కామునిశరములవలె తాకెనా? ఓరీమూర్ఖా! అవియే ప్రాణములుతీయునవి. కామశర పీడితవరియగా నాకై పడిచచ్చుమంటివి?

కుమా—నీయందమునకు వలచి కాదు. జయద్రథ కుమారునకు బరిణయంబుగావింపనెంచిన కన్నెను గొల్లకుఱ్ఱండు కొనిపోవుచుండగా నేమియును బరాక్రమము లేనివానివలె సైంధవేయుండూరకుండెనని జనులు రేపటినుండి హసింతురేమోయని యెంచి యేతెంచితి?

సాంబు—ఓహో! ఇప్పుడు రోహాడిదెబ్బలుతిని పాఱుపోనాసందకన్న నీహాస్యమెక్కువ కాదా?

లక్ష—దేవా! అంతజ్ఞానమా! వానిని గష్టంబడికన్న తండ్రికేలేదు వానికెట్లు వచ్చును?

కుమా—ఓహోహో! పరుని యాలి ప్రస్తావనకు పరపూరుషుండే సంతసించవలె

సాంబు—(నవ్వి) ఓరీ! పరునియాలి యెవతెరా?

కుమా—లక్షణ యెవనియాలి. నీచే జిక్కినంతనే రొట్టినేతిలోంబడెననియనుకొంటివా?

లక్ష—ఓరీ! మూర్ఖా! ఇంకా నీకు నాపై యాశవీడలేదా? ఇదే మోహనాస్త్రముచే మూర్ఛంజేతు. (విల్లు వంచును)

కుమా—ఓహో! ఇదివరలో విశరిన శరములు పూల సరముల గతి తగులగా! మోహనాస్త్రముచేత నాకను మూర్ఛిల్లజేయుట?

కం. నీమోహనాస్త్రమే యును, వ్యామోహితుఁడైన సాంబుపై మూర్ఛిల్లగన్
వామీఁద విశుతువేని యుఁ గామించు నశనిప నేమి కావలె నబలా!

ఇదిగో నీవు నాపైఁ బ్రయోగింప నెంచిన యస్త్రమును నిన్నుఁ బ్రేమించినభూతముపై విడుచుంటిని (అని సాంబునిపైఁ బాణమును వదలును)

లక్ష్మ—(సాంబునిపై విడచిన బాణమునుఁబడఁగొట్టి) ఓయీ! దాస్సలేయా! ఏమీ! నీదౌర్జన్యము? మా జాంబవతీ సుతునిపై శరములనుఁ బ్రయోగించెద వేమి? అతఁడేమి నీకపచారముఁ గావించె? నీపైకి విశిఖమ్ములను జిమ్మిన దానను నేనా? యాతఁడా?

కుమా—ఈకపట నాటకమునకు సూత్రధారుఁడు సాంబుఁడు కాఁడా! వానివల్ల నే కదా? యీకథ పెటిగినది. కీలెఱిఁగి రత్తు వేసినటుల వానిని త్రుంచిన నింతటితో నీకథ సాంతమగును. నీవు నాకాంత వన్యోదవు.

సాంబు—ఓరీ! స్వపచా! యెంతెంత తెలివితేటలున్న విరా? నేను నీవును గాకున్న దీనికింక భర్తయే లేడను కుంటివా?

లక్ష్మ—ఓయీ! కౌరవయోధులు రాకమున్నే నిను సాగనంపవలె. ఇదే కానికొమ్ము నాశర ప్రహరణములు.

కం. బదునైదు నైదు పదియును, బదపడి యాపైన నాల్గు పది యారయుచున్
వదలితి నీసమ్మదమును, మదమును విడనాడి గృహము మరి చేరవలెన్

(అని యొకఁటి వెంబడి యొకఁటి చొప్పున బాణములు విసరును)

(కుమార జయద్రథుఁడరదముపై మూర్ఛిల్లును)

సాంబు—లక్ష్మణా! నీబాణ పరంపరలచే నీమేనబావ మూర్ఛితుఁడైనవాఁడు. ఇదే సమయముగా నెంచి యమసదనమునకు బంపుదునా?

లక్ష్మ—దేవా! అది చాలాఘోరము. మీయందలి మోహముచే నింతపని యొనర్చితిని గాని కేవలము వధ చేయుటకు మనసొప్పునా? చిన్నతనంబున నుండేడి చెలిమినైనా తలంపవలదా? ఈసంగతి వినుండు.

ఉ. చిత్తము బావనిన్విడిచి చెందుట మిమ్ముల ఘోరమందుపై
నిత్తటి వానినిందెగచు నెంతయు నింతనరాని ఘోరమౌ
అత్తకు మామకున్ గడుపు నారట, మాశలిఁదండ్రు లాదికిన్
బొత్తిగ దుఃఖమౌ, మనకొ పూర్తిగ దుర్గతి ప్రాప్తమౌ కదా.

అది యటుండనిండు.

కం. పరిణయమునకుండినపో, సరసంబలెబావనిట్లు చక్కాడగనీకం
చోరులాడు దూషణంబులు, భరియింపగ మనకుఁ దరమె ప్రాణప్రియుడా
మేనబావ యుద్వాహమాడఁ దలంచిన లక్ష్మణను మీర లుద్వాహమౌ

డుటయే బావకు శిరచ్ఛేదన మింతకంటె నేమి కావలయును?

సాంబు—(కౌఁగలించుకొని) సఖీ నీమనోభిప్రాయ మెఱుంగ నిట్లంటినిగాని నిజంబుగా వానిని ప్రమందించుటయేల?

కం. సగమీల్గిన వాఁడేమగు, మగువా! వానిం బరిణయ మనకుండుటచే
ఇఁక నీల్గఁజేయ నేటికి, సగమీల్గిన వాని మనముఁ చందనగంధీ

(అంతట తెఱలో)

కం. కోడల! అరగడె క్రిందట, ఏడాగోడెములు నాడి శేమనుకొనెదో
ఏడాటల్ యాడించెద, నోడించెద రణమునందు హా రత్రింతుక్

సాంబు—చెలీ! నీమామయగు సైంధవుఁ డరుగుదెంచుచున్న వాఁడు.

లక్ష—రానిండు. కుమారుని యవస్థయే నాతఁడును పొందఁగలఁడు.

(కోడల! అను పద్యముఁ జదువుచు సైంధవుఁడు ప్రవేశించును)

సాంబు—సింధు రాజా! ముందు నీకుమారుని గతిఁజూడుము. ఆతరువాత మమ్ముల నేడాట లాడింప వచ్చును.

సైంధ—ఏమీ! నాకుమారున కేమి? ఓహో మూర్ఛ నొందినవాఁడా?

కుమా—(మూర్ఛఁదెలసి) తండ్రీ! నీరాక నాకు సగము బలము లభించె! ఇఁక కాసు కొమ్ము. సాంబా! ఇఁకనైనా నాయింతిని విడచి ద్వారకా నగరంబునకు దారి చూచు కొనెదవా? లేదా!

సాంబు—కుమారా జయద్రథా! ఏమీ! శూరాగ్రేసరుండగు త్వజ్జనకుండరుదెంచెగా యని నావాల్గంటిని త్యజించి యింటికేగమనెదవా? ఓహో! లాటి యాకుల చప్పుళ్లకు కుందేళ్లు బెదరునా? మీతండ్రియే కాదు కౌరవ సేన సంతయు నొక్కుమ్మడిగా మీఁదబడనిమ్ము. అంతేకాదు ముల్లోకముల వారొక్కపెట్టుగా రమ్మనుము నాకు భయములేదు.

సైంధ—ఓయీ! జాంబవతేయా! ముందు మమ్ముల నిర్జించిన పిమ్మట కదా? కౌరవసేన సంగతి యోచింపవలె. వారిని నోడించిన తర్వాత కదా ముజ్జగంబుల వారిని దాకనెంచుట వారిని జయించుట ఈదెబ్బతో:—

ఉ. లక్షణ! సాంబ! మిమ్ము నతిలాఘవ తలంబగు చాట్లుపెట్టి యీ
కత్తులఁ గట్టి కాస్తివిధిగా వొనరింప నిదే మొదల్ విశా
లాక్షులు పూరుషుల్ మిముసె లక్షణగా గొనుచుక్ స్వయంవరా
పేక్ష త్యజించి నడ్చెదరు పెద్దల కొప్పిదమైన పద్ధతిన్

లక్ష—మామా! ఎంత వింత యూహా జనించినది. ఈయూహ కొనసాగిన నిపుడు లటుల తలంకిమానిన వరాన్వేషణము మానుకొనెదరేమో! అది నిశ్చయించు

కర్ణ! వివర్ణ! రేది యెట కర్ణము కానగరాదు దూఱగా
కర్ణ! యటంచు వాడవె? యికన్నిను తాపస నారకం బనే
కర్ణమునందు జొన్పుటకుఁ గ్రమ్మర వచ్చితి కాసుకొమ్మికన్

సాంబు—ఈ తెల్వితేట లిద్దివఱలో నేమయినవి?

కర్ణు—ఏమయినవా? శారాజుయొక్క యాజ్ఞ లేకపోవుటచే నడుగంటినవి.

లక్షు—తండ్రీ! యంగరాజా! మాజనకులిడివఱలో నంగీకరించిన నంగీకారమునకు భంగము తెచ్చిన దురాత్ము లెవరు?

శకు—లక్షణా! దాచగనేల? నాప్రోత్సాముచేఁ ద్రిప్పితి. నీసైజలక్షణము మాన్పనెంచితి.

కం. లక్షణ! నీసైజమనే, లక్షణమును జూపి నందులకు నిను, నిన్నా
పేక్షించు కతన సాంబుని, రక్షాబంధనముఁగూర్ప రహి వచ్చితిమా

లక్షు—తాతా! నీవు నాకే రక్షాబంధనముఁ గూర్పకున్న మఱియెవరికిఁ గూర్పఁగలవు. "తిన్నయింటికి వాసములెన్న" వలెననుసామెత రిక్తవోవునా? అనియుటుండగా "సర్వంన్నా శాయమాతులా" యనేఁడి లోకోక్తిగతి యేమికావలెను. నీవలననే కౌరవ పాండవ సంగ్రామము రానైయున్నదికదా? నీనామమునకుఁ గసార్థకము సఫలతలోనికిఁ దెచ్చితివి.

చ. తెక తెక నుడ్కనేల? తెక తేరగ మాగృహమందుఁదింటు మా
కొక కొక రందుఁ గయ్య మొనఁగూర్చెదు, దుశ్శకునం బెదుర్పడన్
శకుని, వెడల్పనా? చెడును పొగిన వారల నొక్కఁడైన జా
వక మరవత్తురే ఓ.పేన పక్షివి మాకెట దాపరించితో

(సాంబునితో) దేవా! మీతో వీనిసంగతి మనవిచేసియుండలేదా? మనమూతలంచిన గతియే యైనది.

సాంబు—చెలీ! జఱగదలంచినది జఱుగక మానునా? కానిమ్ము. ఇదియు నొకందులకే మంచిది.

శకు—లక్షణా! నీవునాపై గనఁబఱచిన యసూయాపిశాచమే నిన్నింతవఱకుఁ దెచ్చినది. ఆపిశాచమునకు మఱింత దోహదమే నీదు చెడువాక్యములు. కానిమ్ము మాటలచే నీనోటికి వచ్చినట్లుగా నొవ్వనాడుము. ఇదిగో వినుము.

తే. గీ. శకుని పెండ్లిలగ్నమునకు శనియె యగ్ని
కార్య నిర్ధూమ ధామఁడై క్రాలఁగలఁడు

సాంబు— వసుధ తిలదానమున శని వదలునటుల
బాణ ఘాతముల శకుని వదలఁజేతు.

భూరి—(శకునితో) శకునీ! ఇంతమంచి యోధవీరుల చెంత జాంబవతేయుఁడు తగుదునని

యెత్తిపొడుపు మాటలచే జవాబిచ్చుచుండుటఁగని కటకటా యుగాన్నాజనుచున్నదేల!
ఏమీ అంగరాజా! నీవింటికియమ్ములనుగూర్పవేమి? శల్యుఁడా! మామాదిరి వేటికి
నీచాపమునకుఁ దూపు లమర్చుము.

సాంబు—ఓహో! సోమదత్తా! వీరలును వారలును బుజ్జగింప నేటికి? [illegible]
కానియ్యరాదా? నీవు మాత్ర మొక యోధ నీవుండవు కావా! [illegible]!
తొందర పడుకుము. నీకు దినంబులు దాపురినవి.

ఉ. నిబ్బరికించి యిట్లు తెగనీల్గఁ నేటికి భారతాజిలో
జబ్బలు త్రెంచి పుత్త్రునిఁగుఱసల్పఁగ మాపిన తండ్రి సాత్యకి
త్యబ్బురమౌ ప్రతిజ్ఞ ప్రియమారఁగఁ జేసెను, నిప్పుడేల క
ద్దుబ్బు తనంబు పల్కులను నొయ్యన నాడఁగ జంకె? దుర్మతీ!

భూరి—ఓహో! భయముచే నోడలు వణకుచున్నయవి. (కంగారు పడినట్లు నటించి) ఇంక
నేమిగతి? (నిందాగర్భముతో) ఎప్పుడోయటు! సాత్యకియటు! ఏమీ! [illegible]
సంగ్రామ మందట! నాజబ్బలు త్రెంచునట! [illegible]నట! ఏమీ!
వింత! ఆశ్చర్యము! అక్కజము. మద్రభూపతీ! ఇందులకు ముందు [illegible]
యోచింపుము.

శల్య—బాహ్లికపౌత్రా! రాఁబోవు సంగతి యోచింతము. ఇప్పటీతని ముఖ్య[illegible]
కొని యావలఁబడవలెఁగదా? ఓయీ? భల్లూక దౌహిత్రా!

కం. శల్యుఁడు నీప్రాణమునకు, శల్యముగతి తగులుకొనియె సంగరమందున్

సాంబు— శల్యుఁడ! నీశల్యంబులు, శల్యంబులచేత విఱుగు సరిగిటు [illegible]

లక్ష—తాతా! శకుని! తాతా! మద్రభూపాలా! మీబంధుత్వ మెట్టి దనగా:—

ఉ. తండ్రికి మేనమామ, పినతండ్రుల కెన్నఁగ మేనమామ నై
గండ్రలు నాడఁ జొచ్చితిరి కాలము నింతగఁగడ్పి చాలు, మీ
యాంధ్రబయెక్కువయ్యె నెవరడ్డము పల్కెడు వారలేక మీ
గండ్రతనంబుఁజూతుమెయి గండ్రలు గండ్రలుగా నొనర్తుమా.

సరే మీఅందరేకముఖముగా నెదిర్పనెంచితిరిగా రండు. ఇదిగో నాశస్త్రము.

చ. ప్రధనమునందు నాదు మెయి ప్రాణము లూడెడు దాక నాదు నొ
రథుఁడగు సాంబుకేనొక శరంబయినన్ దగలంగ నిత్తునే
రథిక మహారథార్ధ రథ రాజక రాజ బలాఢ్యులార! నే
డధిక ప్రసంగమేటికి శరాసన మెక్కిడి యేయుఁడమ్ములన్

(అని విల్లునమ్ములతో సాంబుని కడ్డుగా నిలఁబడును)

(కర్ణ, శల్య, శకుని, భూరి, శ్రవాదు లొకరి మొకరు చూచుకొందురు)

కర్ణ—(తన వారితో జనాంతికముగా) అయ్యా! మన కయ్య మెట్లు సాగును?

చ. మనవకు లక్షణాంబ మనస్ఫూర్తిగ యాత్మజ కాన నామెకున్
దగు లతకరంబు లొసగ్వఁడు కదా వరపాలుడు. సాంబుఁడౌ కదా
జగడము కర్త వాని నెటు జేరుట, లక్షణ యొడ్డగింప, పో
పగతుని గట్టగాఁదలఁప భర్తునికిన్ దగాలన్న రీతియా

శకు—కర్ణా! ఇఁక నొకఁటి మనము బాగుగా యోచింపఁదగ్గ యంశము కలదు. అది వినుఁడు:—

ఉ. లక్షణ బుద్ధికౌశల సులక్షణ, తెన్నగ బాణ శిక్షలో
లక్షణ నైపుణీ విదుష, లక్షణ సంగరరంగమందు ప్ర
త్యక్ష సదృక్ష సాంబుఁడని యాడఁగ నొప్పెడి సాంబుఁ గూడ నా
కక్షనెదిర్చి నిల్వ మన కామ మొనర్చిన ధాత శక్యమే.

కావున ముందుగా వారల నిర్వాను విడదీయదగ్గ యోచన సల్పుడు.

శల్య—మనమీగతి యాచరించిన జాంబవతేయుఁడు చిక్కునని నాతలంపు. ఎట్లంటిరా?

ఉ. స్యందన సైంధవంబులను జక్కడగించితి మేని దేవకీ
నందన నందనుం డేదియు నర్వఁగజాలక డాలుకత్తి పెం
పొందగఁబూని క్రిందికుతి కొయ్యన పైఁబడి పోరుచుండ, నా
సంము నెఱింగి కన్నెను పసందుగ దొంగిలి పోనగింటికిన్

భూరి—బలే! బహు చక్కగానున్నయది శల్యునియూహ. కర్ణా! ఇఁక జాగేలా! కాంధారనాయకా తందర జెందవేమి? మద్రభూపతి! వీరలను రణంబునకు హెచ్చరించుము.

శకు—సాంబా! యుద్ధమే కర్తవ్యమా!

లక్ష—తాతా! నీకు నీతియున్నదా లేదా? ఆ జాంబవతేయునితో నీకు ప్రశంస యేల?

కం. లక్షణ సాంబకుమారుని, సాక్షాద్వరియించి యుండ సాంబుని మీరల్
యాక్షేపించఁగ నేటికి, కక్ష నెదుర్చెడి నాతో చేతఁగానెఁడె పొండీ

సాంబు—(కోపముతో) ఏమీ! యెంత తెల్విఁతేటలు గలవారు. లక్షణపల్కులా? యర్థముగుటలేదు మీకు తెగింపా! ఆ యంతకం బెసున్న. ఓహో!

ఉ. భారత యోధులార! తెగబాటొక యింతయు లేని బీరమా
ఆలుపులేల? సిగ్గుభిడియంబులు లేవొకొ? యిందరేకమై
ఆనయఁగన్నులందెఱుప నట్టి నిసుంగుల బట్టలేని మీ
శూరత భారతాజి నెటు చూపెదరో? యిసి యబ్బురంబగున్

పాపము. మిమ్ములను నమ్మి కర్ణాకు కాలుదువ్విన సుయోధనుఁడదోగతి చెంద

# ప్రతిజ్ఞా యాదవము

సాత్యకి సహాయుఁడు మిమ్ము జంపునాడు
ఔర! ఱక్కలు సక్కలు నైననెన్న
డొందనటి పాట్లు మీరలు పొందఁగలరు.

లక్షణా! ఇఁక తేరును నిల్పవలదు. వడివడిగాఁ బోనిమ్ము. అధిక ప్రసంగ మన్ని విధముల నష్టము. పోనిమ్ము తేరును పోనిమ్ము.

లక్ష — దేవా! మీ సెలవట్లనే యొనర్చెద. ఓహో! కౌరవవీరులారా!

ఆ. వె. బీరము కలదేని తేజును నడ్డుడు కాక యున్న పొందు గర్వముడిగి
లేద! వత్తురేని యీదినమందు నే, ఆలుబిడ్డలమోమ లాసవిడుఁడు
ఇదే మారథ గమన కౌశలము.

(సాంబలక్షణలు నిష్క్రమింతురు)

భూరి — మీర లెంత దవ్వేగినను మీ వెన్నంటి పట్టితీరెదము. (అని నిష్క్రమించును)

శకు — సాంబా! నిన్నుఁ జెరసాలయందుంచి లక్షణ గర్వమునడంపకున్న శకునిని కాను.

(నిష్క్రమించును)

శల్యు — లక్షణా! యరద మాపు మాపుము (అని నిష్క్రమించును)

కర్ణు — ఓహో కౌరవయోధులారా! ఇదే రాధేయుఁడరుదెంచుచున్నాఁడంతవరకు నరదమును నడ్డగింపుడు (నిష్క్రమించును)

(యవనిక జాఱును)

ఓహో! కౌరవయోధులారా! భయంబులేదు. ఏలపాటిపోయెదరు?

కం. హరి సుతునిదెస హరిసుతుఁడు, హరియై హరి హరిని బట్టి నట్టుగ నరినిన్
హరి సుతుఁడు పట్టెఁ గంచును, హరి భోగియగు నృపు కడను హరువుగఁ జెప్పుడీ

ఇఁక లక్షణ సంగతి వినుఁడు. ఆ మెసింధురాజునిచేఁజిక్కి బలవంతము గారథంబు మీఁదబడి వచ్చుచున్నది యని యానతింతు జను భేరికరి పురమందు వేయుంచుఁడు

గద్య పద్యము.

మత్త. సొంపు వర్తనచే జెలంగెడు సోమసుందర మాంబతో
దంపతుల్ కలరారె తేనియ ధారవోలె కవిత్వ మం
దింపుగల్గి ప్రబంధరాజము లెన్నియో రచియించి గా
రంపు ఖ్యాతిని కన్న సుందర రామయార్యఁడె వ్రాసెగా



శ్రీరస్తు

# ప్రతిజ్ఞాయాదవము

అను

## సాంబవిలాసము

---

### తృతీయాంకము — ప్రథమరంగము

---

### ద్వారకానగరము. శ్రీకృష్ణుని మందిరము.

(ప్రవేశము శ్రీకృష్ణుఁడు, బలరాముఁడు, సాత్యకి ప్రద్యుమ్నుఁడు, నారదుఁడున్నతాసనములపై)

కృష్ణ — దేవా! ఋషివర్యా! తరువాతమనసాంబునకును లక్షణకును గౌరవయోధులకును ప్రధనమే గతిగా నడచినది?

నార — కృష్ణా! ఆశ్చర్యమాశ్చర్యము. ముందుగా లక్షణ సామర్థ్యంబు వినుండు.

సీ. అస్త్రగురుండని ఖ్యాతిఁగాంచినయట్టి ద్రోణుఁడాలమున నిత్రాణుఁడయ్యె
క్రీడినోడింతని క్రేడించి పల్కెఁడా, కర్ణుఁడాజిని లంబకర్ణుఁడయ్యె
రారాజునకు రాజ్యరమనీయనెంచిన, శల్యుఁడాయనిని విశల్యుఁడయ్యె
మాయజూదమున నజేయుఁడై యడరెడి, శకునియాపోరులో శకునియయ్యె
తే. గీ. సారథి యగుచు సాంబుఁడు తేరుఁగడప
రథియగుచు లక్షణ తనశూరతను జూప
మీదు క్రిందునుగానక మిట్టిపడెడి
భారత భటులెల్లగా పటాపంచలైరి.

బల — బళే! లక్షణా! నీయందు మాసత్రజితి పోల్కి యున్నయది.

మన్మ — తండ్రీ! బలదేవా! మీ మా మఱుఁదింపస్త్ర విద్యలో నైపుణ్యాతే

సాత్య — అత్తపోల్కి కోడలి యందుండుట స్వభావమే.

నార — ఆయుధ యుద్ధనైపుణ్యమొకింత వినుఁడు.

గ్రీష్మము నందు తాపమున డింది జలంబు గుపించఁజేట్టుగా
శుష్కము చేదసుల్వాడిన శుష్క తృణంబులు కానరాదుగా.

కృష్ణు—కుమారా! నీపలుకులు నిక్కంబులే. గాంగేయుఁడే నిర్మోహమాటముగా, నిష్కల్మషముగా, నిశ్చలబుద్ధిగా సుయోధనునకు బుద్ధిగఱపిన నింతముటుకీ సంహారము పుట్టునా? ఈవిషయమందే కాదు భీష్ముని మౌనము. ప్రతి రాణకీ దౌర్యమంబునందుఁగూడ వహించుటచే సుయోధనుఁడు విజృంభించుటకుఁ బ్రారంభించినవాఁడు. వినుము:—

సీ. అసలనూయపిశాచ మావహించుటకెన్న, గాంగేయు మౌనమే కారణంబు
పాండుకుమారుల వనవాటికనుపుట, గాంగేయు మౌనమే కారణంబు
యాజ్ఞసేని నుచేల కపహరణమునకు, గాంగేయు మౌనమే కారణంబు
పాండవులకు రాజ్యభాగంబు నియకుంట, గాంగేయు మౌనమే కారణంబు
తే. గీ. అతఁడిది తగదంచు తెగించి హితవుఁగూర్చ
లేక మౌనముద్రను దాల్చె యాకరణమున
కౌరవేంద్రుఁడు చెలరేఁగి ఘోరకృత్య
కార్యములఁజేయ సమకట్టె కపటి యగుచు.

బల—తమ్ముఁడా! శంతనుని మౌనము కౌరవేంద్రుని కొంప ముట్టేట్ల గట్టినదియే?

సాత్య—సోదరులారా! మనము భీష్మునే నిందింపరాదు. ద్రోణాదివీరులందరు రారాజు వర్తనమునకుఁదల యూచిన వారలే. ఆకారణముననే రాజుగ కాడినదియాట పాడినది పద్యమైనది. అందుపై నీభరత వంశ చారిత్రమొక నాటక కావ్యముగాఁ బరిణమించినది. అది వినుండు:—

సీ. మాయజూదము పరమాయించి భారత, కథకలిగించె గాంధారి నృపతి
ఆకథానాటక మాడింపఁజెడకుంత, సూత్రధారుండయ్యె నూరిజుండు
పాత్రలొకురుశత వ్రాతకు బోధింప, విద్యను గురులైరి భీష్మగురుఁడు
బాగుగా నాటక ప్రదర్శనమునకు, ప్రోద్బలుఁడయె చీకు మామ శకుని
తే. గీ. వీరలీ నాటకంబును వేదపఱుప
రంగముగ కురుక్షేత్ర మేర్పాటుఁజేయ
దాన్నిపై కథానాయకత్వమున కలరె
కౌరవేంద్రుని తప్పేమి కలదు చెప్పుఁడి?

కృష్ణు—అనుజా! నిశ్చయమే? మాయజూదమే లేనియెడ భారత గ్రంథము లేనేలేదు. ఆపై రాధేయుఁడు గాంధారేయుని పక్షము గాకున్న సంగ్రామమే లేదు. భీష్మ ద్రోణులు విలువిద్య ధార్తరాష్ట్రులకు నేర్పకున్న మొదలే ప్రధాన స్వత్వము

లేమ. వీటికన్నిటికి పుట్టు ప్రసిద్ధియంగీకరింపకున్న సంక్షోభ సన్నాహ ప్రసక్తియ మేలేదు. దానిపై కౌరవేశుఁడు తీవేమి దిగవిడిచినది కథానాయకత్వము నంగీకరించుటకు. ఈవసుంధరనంతయు నేకచక్రాధిపత్యముగా నేలఁదలంచుకొనినయప్పుడు. తపోధనాగ్రణీ! మాకొడుకు గోడలియరదంబును జుట్టుకొనిన కౌరవ వీరులు తరువాతేమయిరి?

సార—లక్షణ కలసటువచ్చెను. ఆపైనతారుమారైరి. అనగా:—

ఉ. సారథి లక్షణాంబయయి సాంబుఁడు తారథియుండునాచు కం
గారొనరించు గాలమున గౌరవ యోధులు దంగుఁబోవఁ, గం
గారొనరించి యందఱుడ గన్పడె యొప్పట తానెయావ హా
ధామణి విశ్వరూపమును దాల్చిన సాంబుఁడనంగ నొప్పగాన్

ఆహా! నేనేకాదు స్వర్నాయకుండగు వజ్రి, దేవగురుండగు బృహస్పతి, మరి కొందరు వేల్పులుకూడా యరదంబులపై నిలచి యంతరిక్షమునుండి వీక్షించుచుంటిమికదా? వారల బలపరాక్రమములకు మేమాశ్చర్యము నొందితిమి? బలే.

క. రథిగను సాంబుండును సారథిగను లక్షణయు లేద రథిలక్షణ, సా
రథి సాంబుఁడై నిలువ నాప్రథమంబున వారిఁగెల్వ బ్రహ్మకుఁదరమే.

దేవా! ఖాండవోద్యాన సమయంబున కృష్ణార్జునుల సారథి రథికత్వమే కంటిమి మరల నేడు లక్షణసాంబుల సారథి రథికత్వమే కంటిమని సంతసించుచుండగా ఏమివచించను.

మన్మ—తరువాత నేమైనా యుపద్రవము జరిగినదా యేమి?

నార—ఉపద్రవమునకేమి? భూరిశ్రవసుని యెఱుంగుదురా?

బల—వానికుటుంబమునకును మాకుటుంబమునకు మూఁడు పురుషాంతరముల నుండి భద్రవైరమేకదా?

ఉ. కప్పగనేల? లోక మవగాహమెగా వసుదేవ దేవకీ
యప్పల పెండ్లికాలమున హాశినిచే భువి కీడ్వగా బడిన్
గొప్పవు గోయగా బడిన కూళుఁడు బాహ్లికు వానిపుత్రుఁడై
యొప్పెడి సోమదత్తుని యహో సుకుమారుఁడు వీడె కాడొకో

నార—ఔను. ఆబాహ్లిక పౌత్రుఁడైనభూరిశ్రవసుఁడు చాటునడాగి తటాలనవరుదెంచి సాంబ లక్షణుల యరదంబునకుఁ గట్టఁబడియున్న ఘోటకంబును నొక్కవ్రేటునకు తుదముట్టించెను.

కృష్ణ—ఛీ! దురాత్మా! ఎంత దొంగపని గావించితివి?

బల—ఛీ! పాపకర్మా! నీకనిలో నీగతియే సంభవించును.

సాత్య—అగ్రజులారా! ఇదియే నా ప్రతిన:—

కం. భూరిశ్రవసుని శిరమును, భారత రణరంగమందు పడనడకక నే
 యూరక విడచితినో నా, పేరైన సాత్యకియని పిల్వఁదగదుగా.

కృష్ణ—నీ ప్రతిన యప్రతిహతముగా నెఱవేఱుఁగాక,

రుక్మి—లోకపూజ్యులగు నాన్నగారి వాక్కు సఫలీకృతమగుఁగాక. దేవా! తరువాత తరువాత.

నార—అప్పుడు తేరుపైనుండి గుభాలున—

ఉ. క్రిందికి దూఁకి సాంబుఁడట గిఱ్ఱున ద్రిప్పి గదాప్రహారముల్
 అందముగా దగల్ప సమరార్హులమంచును వీఱువీఁగు వా
 రందరు కాళ్లకుం బని యథాయథలై పఱువెత్తిపోవరే
 కుందుచు, చాపరాయిపయిఁ గొట్టిన కావపు పెంకులో యనన్

ఈసందడిలో గౌరవుల బావ మఱది యగు సైంధవుఁడు వెనుక సాటుగవచ్చి లక్షణను సందిటఁబట్టి యరదంబుపైఁబెట్టుకొని పాఱిపోవఁజొచ్చెను.

బల—ఓరీ! శ్వపచా! నీవొక క్షత్రియుఁడవేనా? మగవాఁడవే.

ఉ. చెప్పి! దురాత్మ! కన్నియను చేకొన శౌర్యమె? యుల్కిపాటుమై,
 దప్పినదాని ఓశ్వపచ! దమ్మనజేయుదె? చేత శస్త్రమే
 లెప్పగనున్న నీ సుకృత శ్రేయము చేతను దాటి తంతకుఁ
 దుస్సల బొందు గట్టిదమె త్రుంచదె లేనెడ నీదు బొందుటన్

కృష్ణ—ఓరీ! జయద్రధా! న్యాయాన్యాయ విచక్షణలేకయే నిన్ను—

ఉ. క్రీడి రణంబులో శిరమొకేటున కే విశిఖ ప్రయోగమున్
 వీడఁగఁజేసి దాని తనవింటి మహా నిపుణత్వ చాతురిన్
 క్రీడగ చెండుతీరున నె క్రిందికి మీఁదికి నంతరిక్షమం
 దాడఁగఁజేసి నాకుఁగల నక్కస తీర్చుకొనంగ పోదునే

సాత్య—ఆగతమునగా గతమెఱింగిన పెద్దల వాక్కు వ్యర్థము కాదుగదా.

నార—కృష్ణా! తరవాయిసంగతి యాకర్ణింపుము. మాయజూదముచేఁ పాండవ రాజ్యలక్ష్మిని సుయోధనుని కంటఁగట్టిన శకుని పెద్దపెట్టున నిట్టని కేక వేసె. ఓహో! కౌరవయోధులారా!

ఉ. లక్షణకన్యకామణి సలక్షణగా మనచేతఁజిక్కెఁగా
 నీక్షణమే రథంబుపయి నింటికి నేగుచునున్న వారమా
 కక్షయికేల? వచ్చినటి కర్జము నిర్జిత మయ్యె సాంబ! ఆ
 పేక్షత్యజించి బాలవెస వెళ్లుము నెత్తురు కొంగు పైచుకున్

బల—ఎంత పొగరుబట్టి మాట్లాడుచుంటివి? ఓరీ కాంధారినృపతీ. నిన్ను నమ్మిన సుయోధనకు నెత్తిపైకి కొంగునే తెచ్చెదవు. నీకీతెగనీల్గుపాటు తెచ్చినవాఁడు రారాజు ఏమంటివి?

ఉ. సర్వమెఱింగినట్టి యొక సర్వసముండవటంచు రాజు తా
సర్వము రాజ్యపాలనము సైతముకూడ నొసంగి, నిన్ను ధీ
సర్వధురీణుగా సలిపె సర్వధురీణుఁడ! సర్వభక్షకా!
సర్వముచేకనో శకుని కన్నులుగానకఁ బ్రేలఁబొచ్చెదే.

మన్మ—తండ్రీ! ఆమిడిసిపాటెన్ని దినంబులు. భాగతాజి సమీపించుచున్నయది.

నార—ఆపిమ్మట లక్షణ గద్గద స్వరముతో నిట్లు వచించె. ప్రియా! జాంబవతేయా!

ఉ. ఏక్షణమందు నిన్ను వరియించి మిమంటు దెంచినానొ నే
నాక్షణమందె మీకు సతినైతిని నమ్ముఁడు పంచభూతముల్
సాక్షిగ నాప్రమాణికపు సాక్షిగ దెల్పితి నట్లుకానిచో
లక్షణగాను కౌరవ నరాధిపు కూఁతును గాను దేవరా!

ఇదియే నాప్రతిజ్ఞ యని పల్కెను.

మన్మ—ఆహా! ఆడుదిదైన నేమి లక్షణ సాహసమద్భుతము.

నార—ఆమెప్రతిన విన్న వెంటనే జాంబవతేయుఁడిట్లు కేక వైచెను.

చెలీ! ఇదిగో నాప్రతిజ్ఞ.

ఉ. అంబుజవైరి సాక్షిగను నంబుజ మిత్రుని సాక్షిగాను నా
యంబుజ గర్భసాక్షిగను నంబుజ మంబకధారి సాక్షిగా
యంబుజ నేత్ర నిష్కరుణయంబవకుంటిన లోకపూజ్యుఁడౌ
యంబుజ నాభుకేనుదయ మందినవాఁడను గాను నెచ్చెలీ!

ఇది తప్పిన రామకృష్ణ సాత్యకుల పాదమాన అని కేకవైచి లక్షణ నిలువంబడియున్న స్యందనమును నెక్కు తలంపుతో బరువెత్తుకొని పోవుచుండ రాధేయుఁడు నేలబారుగా నొక్కశరమున జాంబవతేయు నిపదంబులకు దగ్గులులాగునవిడచెను అయ్యది తాకి యాతఁడు బోరగిలఁబడెను.

బల—ఆహా! ఎంతఘోర మెంతఘోరము. ఓరీ! నరపశువా!

కం. రాముని వంచించియొ, గా, రాముఁగ విలువిద్య నేర్చి ప్రబలితి ననుచున్
రామసుతు నడకొని పో, రామునిఁ బెట్టుటకు గాఁదలంచితి పటురా!

కృష్ణ—అగ్రజా! ఈకర్ణపిశాచ మావహించియే కదా రారాజు క్రిందిమీదెఱుంగక యున్నవాఁడు. వినుము.

సీ. కర్ణపిశాచమాకర్షితుండై రాజు, పైశాచవర్తన బఱగియుండె

కర్ణజపమును నాకర్ణించి రారాజు, ఏజపగోష్ఠిని యెంచకుండె
కర్ణమంత్రవిశేష గతికిలోఁబడి కోఁడు, పరమంత్ర తంత్రముల్ అరయకుండె
కర్ణమా రాజ్యనాకము కర్ణుఁడనిసామి, గోకర్ణ మటుపని కొనకయుండె.

తే. గీ. కర్ణ దండువలనశంక కర్ణుఁడగుట
కర్ణముల కెద్దియును వినాకర్ణనయ్యె
కర్ణ వేష్టనములతోడఁ గర్ణ మొక్క-
కర్ణికమునకు శిగమూడఁ గతిని జేతు.

నాకుమారునిఁ బట్టి నాకు విచారమును గూర్పఁ జేసినటులే నీకు తుక గత్తిరింపఁజేసి నీజననీజనకులకు మేరలేని దుఃఖమును గూర్పనా?

నార—అంతట శల్యుఁడు క్రిందపడియున్న జాంబవతేయుని సందిట నదిమి పట్టి తన స్యందనముపై నిడుకొనియె. పిమ్మట కౌరవయోధులు సల్లాపములాడుకొనుచు హస్తినాపురమార్గము పట్టిరి.

బల—(క్రోధముతో) శల్యా! మద్రభూపాలా! ఎంత పొగరుబట్టియుంటివి?

ఉ. శల్య! సుయోధనింటఁదిని శల్యము తీరు మదించి మించి నీ!
శల్యగుణాన్వితుండవయి శల్యము కెప్పుడు సిద్ధమై యసిన్
శల్యము రీతి తొలుకొని శల్య పరంపరల చిమ్మ సేతువే
శల్యుఁడ! శల్యముల్ విఱిచి శల్యము నేవదలంగఁ గొట్టెదన్

సాత్య—అగ్రజా! శల్యశబ్ద విమర్శన బాగుగా నొనర్చితిరే.

కం. శల్యము బందియు విషముగు, శల్యమనఁగ బీసలాట శల్యము మేకా
శల్యము శరమగు నెముకగు, శల్యమనఁగ పీడని యొగి శబ్దార్థమయెన్

మన్మ—జనకులారా! దీనికి యోచనయేమి?

నార—నాకపటినుడివిని తరువాత యోచింపుఁడు. సాంబునిగొనిపోయి బంధీకృతునిగా జేసిరి. లక్ష్మణ గోలయింతంతని జెప్పనాకలవికాదు. క్రియావిషయమిది. పిమ్మట వృత్తాంతమాలోచింపుఁడు.

బల—మానివర్యా! యీమాట నిశ్చయమేనా? ఓరీ! కౌరకుల వినాశకారకా! ఎంత కనులుగప్పియుంటివి? సాంబకుమారుని నెవనిగా నెంచితివి? నీకూఁతునకుఁదగిన మగఁడు కాదనుకొంటివా? లోకైక పూజ్యులగు రామకృష్ణుల సూనుఁడని జ్ఞానము లేకఁపోయినదా? నీకు గదావిద్యను నేర్పిన గురుపుత్రుఁడనిగూనా జ్ఞప్తి లేకబోయినదా? యాదవులతో బాంధవ్యము నీచమని యెంచితివా? ఓరీ గురుద్రోహి! ఓరీ భ్రాతృద్రోహి! ఇదిగో నాప్రతిజ్ఞ విను—

చ. గజగజలాడి మత్సరణ కంజములందున్నవ్రాలి మ్రొక్కి- యూ

త్మజను, కుమారు సాంబుఁగొని శత్రుల సుర్యోణ సేనఁ జేసి నీ
గజపుర మొక్కపెట్టువను గంగను ద్రోసిన. ద్రోయనే జగ
ద్భుజమున గోవధంబునను బొల్పదు కీర్తిపు మొందినట్లుగా
ఇదే హలధరమాత్రుండ నే వెడలెద (నడువఁబోవును)

నార—బలదేవా! ఈమాత్రపు ప్రతినకే రారాజు గజ గజ వడంకి కాళ్లపైఁబడి కూఁతు నొసంగుననుకుంటివా? ఆతఁడు పాండవులతో నిదివఱకెన్ని ధక్కా ముక్కీలను తేరియున్న వాఁడు. తాటియాకుల చప్పుళ్లకు కుందేళ్లు బెదరునా?

సాత్య—(లేచి) ఋషీంద్రా! మాధాటి యాతఁడెవనరలో నెఱుంగఁడు. మేమనిన ముజ్జగంబులు గడ గడ వడంక నాతఁడు లెక్కమిటి? (కృష్ణునితో) దేవకీనందనా! అన్నగారితో వెడలుటకు నాకుఁగూడననుజ్ఞయిమ్ము. ఇదిగో నాప్రతిజ్ఞ—

ఉ. పోరొనరించి కౌరవుల పొంకము బింకము నింకఁజేసి మ
త్కార్కిరిమి కోడలింగొనుకతో జనుదెంచెద, ద్వారకాపురం
బూరక వత్తునేని గురుయోషను నంటిన వానిదుర్గతిన్
బోరున పాలువాఁడిలను బొందెదఁ రౌరవ మొందువాఁడనౌ

కృష్ణ—మంచిది. ముందుగా మీరలేగి యక్కురుపతిని సామదానములచే నాతని మనంబూపి మాడుఁడు. అంతులకా నరేంద్రుఁడు విన (అర్ధోక్తి)

నార—ఓహో! కృష్ణా! "కళపోసి పెట్టినయుట్టివంకే చూచెనట" అతీరుగనున్నయది మీయభిప్రాయము. కూఁతురు వరించెనని నీతియైనను లేక కౌరవయోధులచే నీకుమారుని పట్టించిన నీచుఁడు, భ్రాతృద్రోహి, కొగవంశవినాశకారకుఁడగు కురురాజు చప్పచప్పమాటలకు మెత్తబడుననుకొంటివా? ఎంత వెఱ్ఱియూహ. చట్టలు విఱుగగొట్టెదనన్న భీమునకే వెఱగొందలేదు. పొట్టచీల్చి నెత్తురు త్రావెదనన్న వాయుజునకే జంకలేదు. గాండీవముచే శిరమెగర చేతునన్న కిరీటికే వెఱపొందలేదు. ఇప్పుడా మీపటాటోపమునకు భయమందువాఁడు. (నిందాగర్భముతో) పాపము కుమారునకు కూఁతునిచ్చి దాస దాసీజనంబులను, రథతురగ గజంబులను వేనవేలు రూప్యంబులను వరణముగా నొసంగి మిమ్ము బతిమాలుననుకొంటివికాబోలు. కోడలు కొడుకుతో హాయిగా నుండవలెనని యనుకొంటివి కాఁబోలు. ఏమీ! ఎంత వెఱ్ఱియూహ. సుయోధనుఁడంత వెఱ్ఱివాఁడు కాఁడు.

కృష్ణ—మౌనీంద్రా! ఆతఁడటుకావింపఁడేని నాప్రతిజ్ఞ వినుము—

ఉ. చక్రధరుండు నాత్మజను చక్రధరాత్మజు కీయడేని భూ
చక్రము క్రిందుమీఁదయిన చక్రసఖుం డరుదెంచి కావినన్
చక్రిని భ్రాతృచక్రముగ చక్రహతంబుగఁ జేయనేని నన్

చక్రియటంచుబిల్వకఁడు చక్రశశరాగ్రజు పాడమానగా

మన్మ—ఓహో! దేవర వారికింత కోపమును దెప్పించినభూపతిటపై భూమిపైమనుఁగుట గుర్వాటముకదా?

నార—కృష్ణా! అట్టియిన ముందుగాహాలాంక్షైసేయులను రారాజు చెంతను వెడలమనియా?

కృష్ణ—దేవా! చిత్తమట్లనే. ఈమాత్రపు కృత్యమునకు సుయోధనునిపైకి చతురంగ బలమెందులకు? ఆతఁడు వినడేని ఇచ్చటనుండియె చక్రాయుధమునంపి కురుకులంబు భస్మీకృంతంబొనరించనా?

7/60

నార—సరే. అట్లకానిమ్ము.

బల—సోదరా! నేవెడలెద.

సాత్య—అగ్రజా! నాకుకూడ నన్నగారితో బోవుటకానతిమ్ము

కృష్ణ—దేవా! ఋషివర్యా! కొంతవరకు మాసోదరులను సాగనంపుదము రండు.

నార—మంచిది.

(అందఱు నిష్క్రమింతురు)

---

## తృతీయాంకము—ద్వితీయరంగము.

(ఇనుపకటకటాలమర్పఁబడిన యొకగది. అందు సాంబుఁడున్నతాసనముపైఁ గూర్చొనియుండగా కటకటాలకీవల లక్షణ యున్నతాసనముపైఁగూర్చొని ప్రవేశింతురు)

సాంబు—చెలీ! నన్ను మీవాండ్రు చెఱసాలయందున జేర్చినందులకై కుందినా? నీకాహారనిద్రలు లేక పరితపించుచుంటివేయందులకై విచారించనా? ఇంతవెఱ్ఱిదానవేమి?

తే. గీ. సాంబుని ఖయిదిగాఁజేసి సల్పుకతన
మగువ! ఆహార నిద్రలు మానితీవు
సాంబునకు నినుబెండ్లియే సల్పుకున్న
అప్పుడేమౌను నీగతి జెప్పు మబల!

లక్ష—దేవా! ఆసంగతి సేవచించవలెనా?

చ. గరళము లేదె? పానిశితఖడ్గముచేరుబడన్నె? అద్దిచే
కుఱుడౌనా? యింత త్రాడు సమకూడదె? పాసము కూడకుండినన్—

సరసులు, కూపములే నదులు చాలవె? గ్రుక్కెడు ప్రాణమెట్టు లే
కరణినినైన బాయుటకు గట్టితలంపుఁగలట్టి బోటికిన్

సాంబు——ఆహా! ఎంతఘోరమెంతఘోరము? బలవన్మరణము పాపహేతువుకదా? అది యటుండనిమ్ము ఇప్పుడీ వేడివీధ యిట్లు పల్కుచుంటివి కాని, నీజననీజనకులు నీమెడలు విఱిచి నీమదికి నచ్చచెప్పి వివాహమొనరించిన నేమి సేయఁగలవు? నీకు పరిణయంబగునటకే యాకుమారజయప్రభునిపై బింకముగాని వానివలన నీమెడలో నాకాస్తుబొందిపడిన పిమ్మటవానిపై నీకెక్కడలేని ప్రేమ,దయ,అనురాగము,స్నేహము లివి వాటియంతట యవియే జనింపకుండునా? అప్పుడు నాసంగతిమఱువవా? నాకే బంధవిముక్తి కలుగునా? ఆహా! ఎంత పాటుబాటు

లక్ష——దేవా! ఎంతమాటసెలవిచ్చితిరి? నేనంత మూర్ఖురాలనా? ఆదౌస్సలేయుఁడా నాప్రియుఁడు? ఇది వినుండు.

సీ. దుర్బలుఁడౌ భర్తతోడ సంబంధమా? తరుణికది వెనుబంధంబుగాని
జోడుగాని మగనితోడ సంసర్గమా? కాంతకది యుపసర్గంబుగాని
దుండగీడగు ధవుతోడ సంసరణమా? నవబోడికది మరణంబుగాని
తుంటరియగు పతితోడ సంసారమా? రామకు ఘనసాగరంబుగాని
తే.గీ. వనితకిచ్చలేకున్న గట్టినది బొంద?
పొల్ల నది గళమున కురిబొందె కాని
అట్టిదాంపత్యమెందైన అలరునొక్కొ
ఆల్మగలమధ్య నాపద లడరకుండ.

సాంబు——చెలీ! ఈ తెగతెంపి నుడులు దుస్సల యెదుట చూపవలెనుగదా?

లక్ష——ఓహో! దుస్సలగైన నాకు భయమా?

(ప్రవేశము కొంతదూరములో దుస్సల)

దుస్స——ఏమీ! ఈలక్షణ సిగ్గుబిడియంబులు త్యజించి జాంబవతేయుని చెంత యెట్లుకూర్చున్నయది. కానిమ్ము సాంబుని పరిభవించితి నాడీనిగర్వమడంగును. (సమీపించి) జాంబవతేయా కుశలమా!

సాంబు——(స్వగతము) ఔరా! ఇదినన్నపరాభవింపనెంచినది. కానిమ్ము (ప్రకాశముగా) కుశలముగా కేమిలోటు.

దుస్స——ఔను నిక్కమే, ఇల్లుకంటెపుడి పదిలము నెది సామెతగా ద్వారవతికంటె యీ హస్తినాపురము సురక్షితము అందు నీవిప్పుడు బందిగమున నుండుటచే మరీసురక్షితముగా నుంటివి.

లక్ష——(స్వగతము) ఏమీ! దీనికనుబ్బుగొనసుతీస్పుకోనుటకు సాంబసమూరుని పరాభవిం

పవెంచినదిగా. కానిమ్ము. ఈమె తనశక్తియెంతవఱకు చూపగలదో యంతవఱ
కూఱకొని పిమ్మట యాటాండించెద.

సాంబు—దుస్సలా! మారుమెలిగా మాట్లాడుచుంటివా? అదికాదు విసుము. భార్యాస
మేతుండవై యుండగా నాకేమికొదవ?

దుస్స—నీకు వివాహమైనదా? నీసతి యిచ్చటనే యున్నదా?

సాంబు—ఔను ఐనది. నాచెలి యిచ్చటనే యున్నయది.

దుస్స—ఓహో! మఱచితిని. మొన్నటిదినమందు శకుని, శల్య, కర్ణాదులొనర్చిన రణమ
హోత్సవమేకదా? సరే! భార్యయెవతె? బాగున్నది. నీతమాషా.

ఆ. వె. పిల్లలెంతమంది పుత్రుడా యనగనె
ఓరిబాబు పెండ్లి యొనరలేదు
అనెడిసామెతటుల నలరెగా నీపట్లు
పరిణయంబెలేదు భార్యయేది?

లక్షు—(స్వగతము) ఎంతదూరము తడవినది.

సాంబు—నాకుద్వాహములేకేమి? నీకుమారునకులేదు. నాసతి నెఱుంగవా?

ఉ. నివ్వెగపాటుఁజేయఁదగు నీటుల గోటులలో, బిటారి, జా
జవ్వని యాడుసెన్నడము జాళువ నేలదిమ్మె, మిటారి, బల్
నవ్వుమొగంబు పోకులకు నాయక, నారులలోఁ, దుబారి, మేల్
మవ్వపుయంతి "లక్షణ" సుమా, మరుచేతి కటారి నాసఖా.
తెలిసినదా లేదా? తెలియకున్న మరల వినుము.

కం. కిక కిక నవ్వుమొగంబును, చక చక మను బుద్ధిచాక చక్యము కల్గునై
తక తక తక్కుడు దారుదు, రక రకమా భూపులలరు లక్షణ సతియా.

దుస్స—ఆలక్షణ యెవ్వతె? నిన్ను పరిణయంబగుటకు.

లక్షు—అత్తా ముంజేతి కంకణంబున కద్దమేల? నేనేఆలక్షణను

దుస్స—నేననగా?

లక్షు—నేననగాఅర్థముకాలేదా? విను—

సీ. ద్వారవతికినాడు కూరిమిచెలినంపి, చెలిమికాని పిలిపించినది నేన
అర్ధమరేయిన యరదంబుమీదుగా, జనుట కేర్పాటు చేసినది నేనె
దారిలోఁగన్నట్టి వారలుకిమ్మనకుండ జవాబు పల్కినది నేనె
అడ్డిన వారికి నంపవ్రేట్లనుకాన్క, కొనియాడు నట్లొసంగినది నేనె.
తే. గీ. శూరుఁడని తెగనీల్గు నీసహానుజునను

చేర్మితలయంటి సాగ నంపినది నేనె
మేనత్తకమును తోసి రాజొసంగ
నా తెఱకమును పెండ్లాడునాతి నేనె.

దుస్స—(కోపముతో) లక్షణా! నీవ్యవహారము ముదిరినదే. ఎంత బరితెగితివి? సరే యిదే నాప్రతిన విను—

ఉ. పాడితొలంగినన్న నిన పల్కులకైనను బంతమూని నా
కోడలిగా గ్రహించి కసికోల్పడ కాలను బెట్టి నేలపై
నేడిచు! రాసిరాసి పొడిచేసెద యత్రికంబుజూపి నే
కోపటికంబు బెట్టెనెడ కూతుని నేధృతరాష్ట్రి జేనికిన్
ఇదే కాసుకొమ్ము నేపోవుచుంటిని, (నిష్క్రమింపఁబోవును)

లక్ష—అత్తా! (ఎదురుగా నిలచి) నేనుమాత్ర మెవతిని? నీవలెనే నేనును కౌరవుల యాడ పడుచునే. నాకు మాత్రము పంతముండదా? ఏన వినుమా—

ఉ. పాయక నాదుపంతము భవాత్మజుపై భవదీయ భర్తపై
మీమొద స్వార్థమైచినటు మేలని లోకులు నాడనట్లు నే
పోయిగ టెంగు రంగయని అమ్మత సూనుని పెండ్లియాడకన్
బోయితి నేని, బోయితని పుత్రిక నే ధృతరాష్ట్రి పట్టికిన్,

దుస్స—సరే నీప్రయత్నముమీద నీవుండుము. నాప్రయత్నముమీద నేనుండెద.

(నిష్క్రమించును)

లక్ష—అంతమాత్రమున భయ మనుకుంటివా? (అని కూర్చుండును)

సాంబు—చెలీ! నీకాతొందరయేల? తొందరయె ప్రమాదము. దీనివలననే కదా శకుని వలన మనకు ముప్పు వాటిల్లినది.

లక్ష—దేవా! కానున్నది కాకమానునా?

(ప్రవేశము కుమార జయద్రథుడు)

కుమా—ఇంకా మాలతకణకు చెఱసాలయందుంచిన సాంబకుమారునిపైఁ బ్రేమపోలేదు. లక్షణా! నాయెడ లింత నిర్లక్ష్యమేమి?

ఉ. సింధురయాన! నెవ్వనిగ సింధునరేంద్రుని బట్టికెంచితో?
రంధియికేల? సింధు యువరాజు సరాగుఁడు, మేనబావ సం
బంధమునందు, వాడిన వివాహము నే యువరాణి నౌదనే
బంధురమా తలంపు నెడబాసి యభాగ్యునినిచ్ఛయింతువే
చాలుఁజాలు నీ తెల్వితేటలు. ఇంకా యేమో మహాకుశాగ్ర బుద్ధివి యని యోచించితిని. నీచతురతంతయూ నీయవినీతుకరమే యుపయోగించు చుంటివి.

లక్ష్మీ—ఓయీ! సైంధవేయా! నీయందన్నిగుణములు కలవుకాని యంచునకు తొంగదు లేనట్టుగా నొక్కసంగతి కలదది వినుము.

ఉ. సింధున కీవు కాఁగల నికేశుఁడవే, చెలివే, నిజంబు సం
బంధమునందు భావవే, వివాహము నాడఁగ వచ్చుఁగాని, ని
గ్గంధ లతాంత మెంత సొబగై వనమేచ్చక నట్టు విద్యనే
గంధము లేని పూరుషుని గైకొనకట్టి యయెచ్చ స్త్రీలకున్.

కుమా—చెలీ! విద్యాగంధములేని పూరుషులను గంధగజేంద్ర గాములు పరిణయంబగుటలేదా? వారలకు మాత్రము సంతతి కలుగుటలేదా? అట్టుల వివాహమాడకున్న వారల పనేమి కావలయును? ఏమీ? యద్భుతమైక్రొత్తలై యీప్రపంచమునందులేని వింతలుగానున్నయవే నీపలుకుల కలకలధ్వని. ఆసంగతి యటుండనిమ్ము. నేను చదువుకొనలేదా? విలువిద్యయందు దిట్టను కానా? నారూపము నీకు నచ్చలేదా? ఏలా వానివరించితివి?

లక్ష—ఓయీ! యీసంగతివిను. విద్యావంతులైనస్త్రీలు విద్యావిహీనులనుబరిణయంబున కొప్పుకొనరు. ఒకవేళ తలితండ్రులు బలవంతముగా బరిణయ మొనరించినను వారిద్దఱకు పొసగదు. దానితెల్వితేటలెక్కువైనప్పుడు పూరుషుఁడు జవాబు సరిగా జెప్పఁజాలక దానిని విడచిపెట్టును. లేదాపూరుషుని బుద్ధిబలము సరిగా తన బుద్ధిబలమునకు చాలనియెడల నదియైన వానిని విడచిపైకి పోవును. ఇదే కారణము సంసారములు విచ్చత్తుగుటకు. ఇక నీసంగతి వినుము. నీవేమో విద్యయెఱిఁగినవాఁడవనియు, ధనుర్విద్యా ప్రవీణుఁడ వనియు, మంచి రూపుఁడవనియు నీయభిప్రాయము. ప్రతివానికిని నట్లేయుండును.

ఉ. కాకితమందు లేఖినిడఁ గల్గిన మంచి ముసద్దిలేక రే?
కైకొని నెక్కుపెట్టుగనె కాశలుఁడే విలువిద్దెలోనఁ? బల్
కేకలుకొట్టి పాడగనె కీర్తన గాయకుఁడౌనె? బుద్ధి వే
కాకృతిలో నరాకృతిగ హత్తినయంత నరుండె చెప్పుమా,

సాంబ—ఓయీ సైంధవేయా! నీవర్థము గ్రహింపఁగల్గిన నాసూక్ష్మదెబ్బయొక్క సంవర్ణము గ్రహించి యూపలకు బొమ్ము. లేనియెడ నీవీసారి మాటాడుట శునకము మొఱుగుట వంటిది.

కుమా—శరే! నీవీ చెలినుండి యీనాఁడి యావలకు వచ్చినపిమ్మటకదా? పరిణయంబగుట

లక్ష్మీ—పోనిమ్ము. ఆబాధ నీకేల?

(తెఱలో)

ఓసుయోధనా? ఓ కురువా రాజా! మీకై బలరాముఁడు సాత్యకీ సహితుఁడై యే

## ప్రతిజ్ఞాయాదవము

తెంచి యుద్యానమందు విడిసి యున్నవాఁడు ఒకసారి మాటాడవలెనట.

సాంబు — చెలీ! ఇక విచారము లేదు. అదిగో వింటివా మా పెదతండ్రి మాపినతండ్రిగారలే తెంచినారని వచించుట. ఓయీ దౌస్సలేయా! ఇఁక మీ ప్రతాపములు కట్టిపెట్టుఁడు ముందు మాతండ్రుల దెబ్బ కాసుకొనుండు పొండు.

ల:మా — సరే! అభిఘాతము.

( తెఱవాలును )

గద్య పద్యము.

మత్త. రూపవంతులు నేలకంటి కులోద్భవాఢ్యులునైన ల
క్ష్మీప్రపత్తేభ్యుని లచ్చమాంబకు మేనయల్లుఁడు నల్లుఁడై
యేపుమీర కవిత్వ సంపద లింపుసొంపు గ్రహించి త
త్త్వాపునశ్ళస్తుతిగన్న సుందరరామయాఖ్యుఁడు వ్రాసెగా

---


### మువ్వాజి

నవరసము లొక్కు గుక్కగా ద్రావనెంచిన మాతాలుకు మువ్వాజి (ఊర్వశీ శాపవిమోచనము) ని జదువుము.

 వేకంట రమణ అండ్ కో,

కొమరిపాలెం,

గోదావరి.

శ్రీరస్తు.

# ప్రతిజ్ఞాయాదవము

అను

## సాంబవిలాసము.



## చతుర్థాంకము.

ప్రదేశము. హస్తినాపురమందు సుయోధనుని యుద్యాన వనము.

(ఒక చంద్ర శిలావేదికపై బలరామ సాత్యకులు కూర్చొని యుందురు)

బల—తమ్ముఁడా! దూతగా బంపిన యుద్ధవుఁడింకను రాలేదుకదా? ఈజాగునకుఁ గారణమేమై యుండును?

సాత్య—అగ్రజా! ఆతఁడు వెడలినది కౌరవరోధుల చెంతకు. బోధించునది సామదానోపాయంబులు. వినువారు రారాజు వాని యనుజులు.

బల—సోదరా! అట్లువచించెద వేమి? యుద్ధవుని బోధ వారల చెవికెక్కదనియా? ఎక్కినను వినరనియా?

సాత్య—(తలయూచి) వారిచెవికెక్కుటయు దుర్లభమే. ఒకవేళ చెవికెక్కినను మనకార్యభారమంగీకరించుటయు మరీదుర్లభమే.

బల—(కోపముతో) ఏమీ! సుయోధనుఁడు గురవగు బలదేవుని మాటయతిక్రమించునా?

సాత్య—వానికి గురువ్వైనై, దేవుఁడవ్వైనై, వానిసంగతి వినుండు.

ఉ. సందొక యింతగగ్గిన పసందుగ దాటుట కంగవించు, నా
సందగు పించకున్ దనకుఁ జావొసఁగూడె ఫలంబు లేద నే
క్రిందను బెట్టినంతపని కేవల మేర్పడఁ బిమ్మటైన పో
సందియమే యొడంబడుట సర్వము కౌరవ మర్యాదాకతాన్.

అందులకు నిదర్శనంబు వలయునంటి రేని చిత్తగింపుఁడు.

ఉ. ఈసున పాండుపుత్రులను హేళనజేయగ, లేనిపోని పే

రాసను ఘోషయాత్రయను యాత్రను గల్పనజేసె, నందు నే
బాసన చిత్రసేనుఁడట బట్టిబిగియొనరించి త్రాళులో
వేసిన పిమ్మటంగద, వివేకము తెచ్చుకు నింటికేగగా.

ధర్మరాజాదులను పరిభవించుట తగదని యడివులో నెంత లాలనగా గంధర్వులు చెప్పినను చెవి పెట్టెనా?

బల—కొఁదలఁచిన పనినికాస్త గంధర్వులు తీర్చిన పిమ్మట సుయోధనుఁడు వివేకము తెచ్చుకొనెనుగదా? ఇప్పుడో ముందుగా మనమాటలకొడంబడదేని మనచేతనైన పని యొనర్చిన పిమ్మటనైనను వినకుండునా?

సాత్య—సరే! మీరంత కఠినముగా బనిచేసిన మనపంతము నెఱవేఱును.

(తెఱలో)

అయ్యా! యుద్ధవా! ఆశిలావేదిక పైనున్నవారే నాబలదేవ సాత్యకులు.

బల—(పరికించి) తమ్ముఁడా! అదిగో రారాజు, దుస్ససేన, కర్ణ, శల్య, శకుని మున్నగు వారలతో నరుగుదెంచుచున్నాఁడు.

(ప్రవేశము దుర్యోధనుఁడు పరివారముతో)

దుర్యో—గురువరునకిదే నమస్కారము. ఓహో! మిత్రమా! సాత్యకీ క్షేమమా!

బల—శుభమగుగాక.

సాత్య—ఓహో! అందఱు క్షేమమే.

(తక్కినవారలుకూడ నమస్కరించిన పిమ్మటందరు కూర్చుందురు)

దుర్యో—దేవా! గురువర్యా!

ఉ. భద్రమె వాసుదేవునకు, భవ్యమెగా గుమమేషుఁడెన్న, సౌ
భద్రుఁడు క్షేమమే, సుఖులె భద్రరమామణు, లుగ్రసేన ని
ర్నిద్రయశుండు మంగళమె శ్రేయమె తక్కిన యాదవాళి, ఓ
భద్రగుణాభిరామ! బలభద్ర! సమాజ్ఞ సముద్ర ముద్రమా.

బల—సుయోధనా! నీవడిగిన వారలందరు క్షేమముగా నున్నవారు.

దుస్స—మహాత్ము లూరకరారు. దేవరవారిరాక శిష్యుల శుభము కొఱకే కదా.

బల—ఔను. శుభకార్యమునకే యరుగుదెంచినారము.

దుర్యో—దేవా! అర్థము కాలేదు.

సాత్య—రారాజా! దాని యర్థమిదివిను. శుభమనగా పెండ్లి. కార్యమనగా పని. అనగా పెండ్లిపనికిగా నేగినారమని యెఱుంగు.

శకు—ఎవరెవనికి?

బల—మగవానికి యాడుదానికిని.

కర్ణ—గురూత్తమా! అట్టి మగవాఁడెవఁడు?

సాత్య—మా జాంబవతేయుఁడు.

శల్య—(పెద్దపెట్టున నవ్వి) ఓహో! ఏమీ! యాతఁడేనా?

కం. పగవారికి వెన్నిచ్చిన, మగవాఁడే నీసుతుండు మగటిమి కలదే
మగవాఁడె యనుటకంటెను, మగువేయని పిల్చినేని మరి బాగగు గా.

బల—ఏమీ! మద్రభూపతీ! రారాజు సుమూర్తియగు లక్షణ తెల్వితేటలు నీకేల లేకపోయెను. నీవు పూరుష జన్మమెత్తి మూఢుఁడనని విఱ్ఱవీఁగు నీబుద్ధి యబల, బాల, బేలయగు లక్షణ బుద్ధికంటె వేయింతలు తక్కువ యయ్యెనె. సాంబకుమారుఁడు మగవాడని యెంచియేకదా లక్షణ గ్రహించియేగా వరించినది. ఆమాత్ర మెఱుంగవా? అది యటుండనిమ్ము.

ఉ. మానుగ మేము మోసకులమని మండిపడెందు వజీరులార! మీ
రూనుగ నేకమై యొక జిలుంగు నిసుంగును దాఁకఁబోడియే
వినదియయ్యె వారను ప్రియంబగు బంధుగులౌట నైతు మో
మానిని యోడ! మాకొడుకు మానగుఁగోడల నిచ్చి పుచ్చినన్.

దుర్యో—(సభ్యులదెస చూచి) ఆకర్ణించితివా కర్ణా! ఆలకించితివా శకునీ, వింటివా శల్యా, మారు పచించవేమి? దుస్ససేనా

ఉ. పేరు ప్రతిష్ఠలేని యదువీరులతోడను బాంధవంబు పృ
థ్వీరమణుండు, క్షత్రియుఁడు, పధీశ్వరుఁ డద్దిర! సార్వభౌముఁడే
సౌమన జేయనొప్పటుఁ? సల్పుట కొలను దాల్చు పాదుకల్
ఈరహి మార్గమందు ధరియించిన తీరుగ నుండునే కదా.

సాత్య—(కోపముతో) ఓహో! సుయోధనా! నీవే వచించవలె. ఈసభికులే సంతసించవలె. చాలుఁజాలు.

ఉ. సంశయమింతలేకఁ జెగసాగుమ బల్కెదో కౌరవేశ! దే
వాంశజులైన యాదవులు పాదుకలా! అజవంశభూత ని
స్త్రింశ గుణాత్మలౌ తమరు సీ! యిసి! మూర్ధములా! బళే! అప
భ్రంశపు నప్రశస్తపు నలంక్రియ లొప్పునె పోల్ప దుర్మతీ!

దుస్స—(తలపంకించి) బావా! సాత్యకి! తొండముదిరి యూసరవిల్లి యగు చందమున ఈవెఱ్ఱి గొల్లలతోఁ బనేమియని యూరకుండుటచే క్రమక్రమంబు పాలముల సంపాదించి యానైన చిన్నపల్లెల కధికారము వహించి యాపైన రాజ్యములు స్థాపించుట నటుపై యూరకుండక పైగా రాజబంధుగులమన్న, ఆపైన మాపిల్లను మీపిల్లవాని కీయవలసినదని మాతో వియ్యమందవలసినదిగా వచించుచుంటివా? ఆహా! ఏమీ!

దుర్యో—తమ్ముఁడా! యువరాజా! బలె! చెబాస్ బాగుగా యోచించితివి. మనమీ వెఱ్ఱిగొల్లల పట్టున:—

ఉ. పోయినదేమి బంధుగులు పోయని యూరక నుంటచేతనే
యేయెడ యాదవాంశమున కెన్నడు లేనది రాజ్య సంపదల్
హాయిగఁ గూర్చుకొంచు భువనాధిపు లట్లు కిరీట శంఖ చ
త్రాయుధ చత్రచామర నృపాసనముల్ కలిగుండిరా కదా?

శకు—ఓయీ! రారాజా! పాములకు పాలుపోసిన విషంబుగా మాఱు తెఱంగున నీయాదవులకు మంచిమాటలతో బుజ్జగించి యుపేక్షించుటచే వీరల గుణంబు లపకారవిక గుణంబులుగా మాఱినవి. చూడుము.

ఉ. అప్పుడె యీ కిలార్లు నడుగంటఁగఁద్రొక్కిన సార్వభౌములై
యెప్పుడి మీదు దర్పమున నొప్పఁగ నాటకు బైపయుండునే
యిప్పగిదిన్ కుమారితను నిమ్మని యాడఁగ తాహతుండునే
ఇప్పటికీగతిన్ మదుకె ఈరల వ్యాప్తి ముందెలుండునో.

శల్యు—ఉండుట కేమియున్నది. వియ్యమంది రారాజు బంధుగుల మనిపించుకొని రేపటినుండి వియ్యంకుల బెట్టునట్లు, అల్లుళ్ల యలుకలజఱిపి రాజ్యములో గొంతభాగము కాళ్ళక్రింద తీసికొని తుదకు రాజ్యమునంతయు నాక్రమించి రారాజును తోసి రాజుగా జేయుదురు. ఈయాదవుల చారిత్రము వినుండు.

ఉ. కాలొక యింతనిల్ప నవకాసము గల్గ తలంబోసంగుచో
వీలుగ రెండుపాదములు పెట్టి, పదంపడి కూరుచుండి యా
లీలగ, వెన్క పండుకొని లెస్సగ నంతయు దోర్చి, యంతటిం
కాలె? యటుండు, పాండవులకంతయుమాయని హక్కు యందుకా.

కర్ణు—బలె! చెబాస్! మద్రభూపతీ! ఎంతవనకూహించితివి? రారాజా! వింటివా మన శల్యుని వచనంబులు. ఆమాటలు నిక్కములే ఇంక నొక విషయముకలదు, అది కూడా యోచనకు తేతగ్గదే?

తే. గీ. మాపఁజుట్టము గావచ్చి చోద్యముగను
కొనకు దయ్యమై యాపహించిన తెఱఁగు
యాదవులు బంధువులై కౌరవాధిపులను
కడకు మిము తగుల్కొనరొక్కో గసి కలుగుచు.

(బలరామ సాత్యకులు తక్క తక్కిన వారు చెబాస్ బలెయని చప్పట్లు కొట్టుదురు)

బల—(లేచి సభవంక కలయఁజూచి కోపముతో) ఓహో! నీ తెలివి తగ్గమంత్రులు యోచనములు స్నేహితులు దొఱకిరి. నీకొంప నష్టపు నట్టుటకు తగిన యమునవులు కా.)

వేఱుకాదు. వీరల సంగతి వినుము. శకునివలన మాయజూదంబున పాండవరాజ్యలక్ష్మిని హరించితివి. అందుచే నాతఁడు నీతలపై చుట్టముగా యెంచుచుంటివి. కాని అది నీవంశ నాశనమునకే. ఓయీ కాంధారేశా!

ఉ. మాతులుఁడింటఁజేరిన సమస్తము నాశమటంచు పండితుల్
వ్రాతలబద్ధమాయె? కురు పాండవ దాయల మధ్య నాటికిన్
హేతుఁడ వీవె? యిష్టా? యదు బృందము కౌరవ పంక్తికిన్ సమా
ఘాతముఁగూర్ప హేతుఁడవు గంగను ద్రోణుఁ దలంపుతో నృపుల్.

ఓయూ! శల్యా! నీవు పాండవులకు మేనమామవు. వారలపుణ్యమున వారింట చేరక సుయోధనుని చేరితివి. కాంధారనాయకుని యంశము నీకును వర్తించును. ఇంకా నీయందొక గొప్పవిశేషము కలదు. విను:—

ఉ. సాధ్యుఁడవాదు పాండవులసాధ్యతి బాహుబలంబు గెల్వగా
ఔధ్యముగాను నీవొకఁడు తక్క మరెవ్వరు నీయనంత భూ
మధ్యమునందు లేరని యమాయకుఁడై నినునమ్మె శల్య సా
రథ్యము కొంపఁగూల్చునని రాజెఱుగండుగ మద్ర భూపతీ.

ఓయీ! కర్ణా! సూతజా! చదువెలింగిన శూద్రునకు జవాబు చెప్పుట దుస్తరమందురు. నీవు సుయోధనునకు ప్రాణమిత్రుఁడవు. నీవా ఫల్గుణుని గెలువని రాజు నీకు రాజ్యమిచ్చి తెగమేపుచున్నవాఁడు. క్రియకు నీపని కీతయనిరోఁటుంగడు. ఈవు సుయోధనుని పట్ల:—

ఉ. కర్ణ! పిశాచమట్ల నృపకాంతుని నెంతయు నాపహించి వ్యా
కీర్ణ మనస్కుగా సలిపి కిమ్మనకుండగ నోరునొక్కి సం
కీర్ణపు వృత్తిసేర్పి క్రియకెందును పైసకు బన్కిరాని గో
కర్ణము క్రిందమార్చెదవు క్షేరము నున్నగఁజేసి రాజ్యమున్.

కర్ణు—ఓహో! దేవా! బలదేవా! తా (అర్ధోక్తి)

సాత్య—(కోపముతో) ఓయీ! కర్ణ! వారందఱు నోఱుమూసుకొనినట్లు నీవేల యూరకొనవు. నీవు మహా యూడిపడితివా! నీవు నోరెత్తిన మాయన్న ముసలమెత్త వలసివచ్చును. అయినయుపన్యాస ధోరణికి యడ్డము పానకములో బుడుకవలె. తగ్గు తగ్గు.

బల—ఓయీ! యువరాజ! మేము గొల్లలమనియు మాకు రాజ్యార్హత లేదని గావించుచుంటివి? ఎంత బుద్ధిహీనుఁడవు. ఈసంగతి విను:—

సీ. ఏమహాదేవుని నేత్రప్రొద్దువిడఁవక, పవసేవసల్పు దిక్పాలవరులు
ఏమహాపూరుషు నింటఁగోరముకడ, పశిగాపులుండు గీర్వాణగణము

ఏమహానీయుని కనయ పొక్కిలిబిడ్డ, అఖిల జగత్సృష్టి యైనస్రష్ట
ఏమహారాజున కిల్లాలుగా నొప్పె, జగమున కంబయై నెగడులక్ష్మి
తే. గీ. అటిమహాబాహుఁడాది నారాయణుండు
దేవ దేవుఁడు పరమాత్మ దివ్యమూర్తి
యైన శ్రీకృష్ణు నెవనిగా నెంచి నీవు
ఎగ్గులాడెదొ చమకాల మేగ కతన.

ఆసంగతి యటుండనిమ్ము. ఆశ్రీకృష్ణుని సంగతి వినుము.

ఉ. ఏవిభు పాద పద్మ యుగళేంద్రము స్వర్గపురాధి దిక్పతుల్
సేవకిరీటి సంచయమె శేవిగ నెన్నఁ డలంకరించు, సం
భావన పావనంబయిన పావని జాహ్నవి శుద్ధిసేయునో
ఆవిభుఁడైన కృష్ణపతి యానగ రాదొకో రాజ్య చిహ్నముల్.

దుర్యో—(లేచి) అయ్యా! బలదేవా! మీయుపన్యాసము నాతలకెక్కుటలేదు. కృష్ణుఁడు విష్ణువో జిష్ణువో నాకదంతయు తెలియదు. ఎవరైననేమి? ఈబెదిరింపుమాటలు మాయెదుట పనికిరావు. మీచేతనైనచో బాణముల్ట్రేటులు శస్త్రములపోటులు చూపుఁడు. మేము లొంగినచో నాపై యోచించెదము. చూడుఁడీ సభవంకః—

ఉ. శాస్త్రవిదుల్ కుశాగ్రగుణ సంస్తవనీయులు సుప్రసిద్ధది
వ్యాస్త్ర ధరామరాధిపులు నైనగురుండు, కృపుండు ద్రౌణిగా
శస్త్ర దురంధరుల్, శకుని, కర్ణ, వికర్ణ, సుశర్మ, భీష్ములే
శస్త్రముదాల్చి నిల్చునెడ చక్రికి నైన నెదిర్ప శక్యమే.

సాత్య—అగ్రజా! హలాంకా! సామదాన భేద నోపాయంబులు వీరల యందుపయోగించవు. ఓపికకలదేని దండునోపాయంబునకు యత్నింపుఁడు.

బల—ఓయీ! సుయోధనా! మత్ప్రతిజ్ఞ నరసి యాపై జవాబిమ్ము.

చ. గజ గజలాడి మత్సరణ కంజయుగంబున వ్రాలి మ్రొక్కి యా
త్మజను కుమార సాంబునకు తత్క్షణ మర్పణ సేయవేని నీ
గజపుర మెక్కపెట్టినను గంగను ద్రోసెద ద్రోయనే జగ
ద్భుజమున గోపనంబునను బొల్పడు కిల్బిషి మొందు పాండవా

దుస్స—(లేచి) ఓహోహో! దేవరవారంతపనియే యొప్పిన కన్నెను గొనివచ్చి పాదంబుల నైబడి మీకుమారునకు బరిణయంబొనరింపమటకు లోబుందునా? ఇంక నేమి యంతసామర్థ్యమే యుండిన యాపని గానింపు.

కర్ణ—(లేచి) మిత్రమా! యువరాజా! మాటలకు లోటేమిటికి? ఏవీ యాపట్టున యష్ట దిక్పాలురే కాదు, ముప్పదిమూడు కోట్ల దేవతలైనే కాదు. యక్షగరుడ గంధర్వ

సిద్ధ సాధ్యులాది దేవగణంబు కోటిగా నిలచినసురాంగణమున తృణసంచయము నెగురగొట్టినట్లు కొట్టమా.

సాత్య—(కోపము) ఓయీ! యీప్రగల్భములకేమి? ఈప్రతాపమా ఘోషయాత్ర సమయంబున నేమయ్యె.

క. రారాజుతో గంధర్వులు, హోరాహోరిగను బోరి హోళి త్రెంచి
జేరచెఱలో మూఢా, ఆరో జేసైతివిట్టి యార్పులికేలా.

ఓ రారాజా! ఈబలము నేనా నమ్ముకొనియుంటివి?

శకు—అయ్యా! జయాపజయములు దైవనిర్ణీతములు. ఆరోజున మారోజు బాగున్నది కాదు. ఎల్లకాలమట్లె సాగునా?

శల్య—బలదేవా! ఘోషయాత్రలో నోడినట్లే యోడిన మీకప్పుడు వారలపట్టె నొసంగి రాజీచేసి కొందురు. ఎందులకిప్పుడీ యాకదంపు మాటలు.

దుర్యో—గురువులతో సమరము ధర్మము కాదు.

కం. దేవాంశజులగు యదతతి, శ్రీ విష్ణాంశజుండు కృష్ణు చేవను గనగా
గావింతుము బవరంబును, వేవేగమె పంపుదేవ వెడలిట వారిన్.

ఇదియే సెలవు. రండు వెడలుద మోకురుసింహములారా!

(బలదేవ సాత్యకులుతక్క తక్కిన వారందరు నిష్క్రమింతురు)

సాత్య— అగ్రజా! సుయోధనుని వాంఛ యిప్పటికైన తమకు విశదమైనదా?

బల—తమ్ముడా! సుయోధనుగర్వము, అహంభావము, నీవిప్పుడే కనగలవు.

ఉ. కౌరవరాజధానియయి క్రాలెడు హస్తిపురంబు సాల శృం
గార సభా సుసౌధములు కల్పి జనాళితో గంగద్రోసి ని
ష్కారవమేను జేయకరయె సాగుడె? ద్వారక కింక కృష్ణు మో
మారయకంగునే? కొనక నర్మిలి కొడుకును గోడలింసఖా.

కావున కరిపురము యొక్క తలమూర్గంబునకుఁ దారితీయుము.

సాత్య—మహాప్రసాదము. రండు.

(ఇరువురు నిష్క్రమింతురు)

(తెర పడును)

గద్య పద్యము

మత్త. న్యాయవర్తనులైన కోట యనంతి శాస్త్రి వరేణ్యునిన్
శ్రీయుతుల్ మరి ధీయుతుల్ తగు స్నేహితుల్ నుతియింప వెం
తే, యశోధన మందభేరు ప్రతిష్ఠ దెచ్చిన శిష్యుఁడౌ
రా! యనందగు మెచ్చుసుందర రామయాఖ్యుఁడు వ్రాసెగా.

---

శ్రీరస్తు.

# ప్రతిజ్ఞాయాదవము

అను

## సాంబవిలాసము.

---

### పంచమాంకము

---

#### ప్రథమరంగము.—సుయోధనునిహర్మ్యము.

(దుర్యోధన దుశ్శాసనులున్నతాసముల నుండగాఁ బ్రక్కను భానుమతి నిలువంబడి యుండును)

దుశ్శా—అగ్రజా! మనమిర్వురము సాంబలక్షణులను మార్గమధ్యమందడ్డఁగినప్పుడు సాంబునకు లక్షణను పరిణయంబొనరించ వలసినదిగా నప్పజెప్పి నిన్ను మరలించుకవచ్చితిని. మఱలదాని విఘాతము కల్పించితివి. ఇప్పుడాలక్షణ యవస్థ యెట్లున్నదో మావదినె నడుగుము.

భాను—దేవా! మహారాజా! మనలక్షణ:—

సీ. ఓగిర మన్నచో నోకిలింతలు సేయు, జలమును జూచును చిలుము గతిగ
నగలు తాల్పుమటన్న సెగసిపైఁబడిపోవు, మనము బోనీదు సుమములఁదరికి
సరిగ చీరలొసంగ సరిగ గిరాటేయు, పట్టుఱైకల నీయ ఛిట్టి పడును
అభ్యంజనము సేయు దభ్యంతరము సెప్పు, వన విహారము మాట యననెయనదు.
తే. గీ. పలుక దొక్క పలుకైన తా జెలుల తోడ
కనదు క్రేగంటనైన స్వజనులను సహ
నిదుర యనునది లేకయే బెదరు చుండు
సాంబునిడిసదాదిగ చెఱసాల యందు.

దుర్యో—తమ్ముఁడా! మేనకోడలు సంగతి యేమి కావలయును.

దుశ్శా—అన్నయ్యా! వింటివా? పురమండలి యెల్ల కల్లోలము హాలాంకుని బారినుండి తప్పి మన మందరము బ్రతికిన కదా మేనకోడలు మాట.

భాను—దేవా! మొట్టో పెండ్లియాడనని కదు దుఃఖించు లక్షణనే సైంధవేయునకీయ వలెనా? తక్కిన మీయనుజుల యాత్మజలు లేరే. వారలు మాత్రము మేనటి కంబు కాదా?

చ. పరిణయమాట కొల్లనటి బాలను బల్మిని బెండ్లియాడి యే
వరుసను దానితోఁగలసి భర్త సుఖించును నట్టి భార్య యే
కరణిని వాని హర్షపుల కాంక్షనిగా నొనరించియేలు నే
వెరవున కాపురంబు నెఱవేర్చుకఁజూతురు మామ యత్తయున్

దుశ్శా—ఇష్టములేని దాంపత్యము జత సరిగా కుదరని యెడ్లను బండికి పూన్చిన సౌంత సౌకర్యముగా నుండునో వారి యాలు మగల మధ్య నటుండును

( తెఱలో పళ పళ మను ధ్వని)

చ. కరిపుర మొక్క పెట్టునను గంగను ద్రోయఁ దలంచి రేవతీ
వరుఁడు హలాంకమూని గజపట్టణ మొక్క పై పెల్లగించ తా
విఱిచి పెకల్చి యెత్తె నగపాలు జలంబుల పాలునయ్యె త
క్కురనగముండె నల్చిన నయాటము నద్దియు నీలపాలగుకా.

దుర్యో—తమ్ముడా! హలాంకునకీదారున మేల?

దుశ్శా—ఆతనికి గాకున్న మరెవ్వనికి?

భాను—దేవరకింత పట్టుదల యేల?

దుర్యో—అయ్యయ్యో! కన్నులు తిరుగు చున్నవే. ఏమిగతి? ( ఆసనమందుండి తూలు టభినయించును )

దుశ్శా—అరెరే యిదేమి? మనమున్న హర్మ్యరాజకుడ్యము కూలుచున్నట్లున్న యదే? యిదేమి దుశ్శకునము. అయ్యయో! ( వెనుకఁకు జారగిలఁబడును )

భాను—దేవా! అపరాధ మపరాధము. ఈసౌధరాజము గిరగిరందిరుగుచున్నయది. దడ దడ యదురుచున్నయది. భూకంపమువలె నున్నయది.

( తెఱలో ధణ్ ధణ్ మను ధ్వని )

చ. కలసె నగంబు హస్తిపురి గంగను తక్కునగంబు నింక పో
కలియుగనుండె పేడలు నగళ్లు నగంబులు సాల లెన్నొ నో
యిలపయిఁగూలెఁ గూలుట కికెన్నియొ నాయెతమయ్యెగా జల
ప్రళయము భూమికంప మొకసారి లభించె నికేమి జేయనా.

( మరల తెఱలో గొప్ప ధ్వని )

అయ్యా! వినుండు వినుండు.

ఉ. కోటకు వెన్కతట్టుగల గోపుర మయ్యదికూలెనౌర? యు

ప్పాటున ప్రక్కనున్న గజవాజి శతాంగ మహాంగశాల లో
క్కోటనగూలె నక్కట తన కోట్లుగ మేట్లుగ ప్రాణులెన్నొ య
చ్చోట నెయ్యాగ్గె సీరిధరు చోద్యపునాగలి నేటు పోటుచేన్.

మీదలా హలాయుధుని దారుణ కృత్య మాపకున్న మనమందర మొక్కపెట్టున గంగను గూలుట నిశ్చయము. రండు రండు. జాగు సేయకుండు.

దుర్యో—(కనులువిప్పి) అనుజా! ఇందులకు యోచన

దుశ్శా—భీష్మద్రోణులతో సీరిపాణి కడకేగి బతిమాలుడు.

దుర్యో—ఏమని.

భాను—కన్నెనిచ్చి కాళ్లుకడిగి జలంబులు నెత్తిపై జల్లుకొనెదమని.

దుర్యో—మంచిది. అటులనే కావించెదను. (అని లేచును)

(తెర వాలును)

---

## ద్వితీయరంగము. హస్తినాపురము బయలు

(నాగలిని భూమిలోనికి దిగించి యదిమి పట్టి బలరాముడు నిలువంబడి యుండగా సాత్యకి ప్రక్కను నిలువంబడి యుండును)

సాత్య—అగ్రజా! ఈకరిపురములో సగభాగము గంగపాలైనది. కొన్ని యుప్పరిగలు, చొప్పరములు, గజశాలలు కోటగోడలు కూలుటయే కాక జనంబులు జంతుజాలంబులు మంటగలసినవి. మనము సుయోధనునికై కావించెడియపకారమాతని ప్రజలకు గూడ తగులుచున్నయది.

కం. రాజాగ్రహపు కృత్యంబులు, రాజునకే నున్నగునెడ లారాజ్యములో
రాజిల్లు మనుజ తతికిని, రాజును బట్టి వ్యథ కలుగు రాజను పగలున్.

బల—తమ్ముడా! "రాజాంతే నరకం ధ్రువమ్" అనెడి ధర్మశాస్త్ర మెఱుంగవా? అని నీతులగు రాజులను గుఱించియే నుడువబడినది.

(తెరలో)

దేవా! బలదేవా! రక్షింపుము! రక్షింపుము!! రక్షింపుము!!!

కం. దిగిచిన హలమును భూపై, మగుడన్ బిగినొక్కితేని మంటి గరిమటుల్
యొగిసి కరిపురంబువ్వెత్తుగ నొకపరి గంగలోకి దొలగు మహాత్మా.
కావున నంతతో నాపుము.

సాత్య—అగ్రజా! సుయోధనుని పలుకులవలె నున్నయవి.

బల—అతఁడే మొగము పెట్టుకొని మనకడకు వచ్చును? చూతము.

(ప్రవేశము దుర్యోధన భీష్మ ద్రోణులు)

దుర్యో—(చేతులు జోడించి) గురువరా! హలాంకా!

కం. ఎఱుఁగక వాడిన నుడులకు, తిరుఁగ నపకృతి యొనరించితిరికద దానన్
గరువపు ప్రాయశ్చిత్తము, సరిగయ్యెను దేవ! యింక క్షమియింపఁ దగున్.

బల—(పెదమోము పెట్టి యూరకుండును)

సాత్య—అగ్రజా! చప్పున కాస్తవశిష్ఠము దీర్చుము.

ద్రోణ—ఓహో! హలాంకా! ఇదే గురుఁడు మిమ్ము నతియించుచున్నవాఁడు. (అని చేతులు జోడించి)

దండకము—రామా! త్రిలోకైకపూజ్యాభిరామా? గుణస్తోమధామా! యశఃకామసీమా!
బలోద్దామభీమా! లలామా! అహో రామ! త్రేతాయుగంబందు సీతేశుకున్
భ్రాతవై యల్ల సాకేతమున్ యౌవరాజ్యంబు చేబట్టి యామానవ వ్రాతమున్
ధాతవై యార్తులం బ్రోవగా త్రాతవై యాచక శ్రేణికిన్ దాతవై ఖ్యాతిచేనీచ
రిత్రంబు పూతంబుగావించితో దేవ! యీ ద్వాపరంబందు భూచక్రభారంబు దీర్పంగ
నా చక్రికి న్నీవు ముందగ్రజన్ముండవై పుట్టితో గాదే? దుష్టాళినిర్జించి శిష్టాళి
నింగావగా గంకణంబున్ ధరించిట్లు భూభారమున్ దీర్చుటల్లేదె? శేషావతారా!
సదా ధర్మచారా! యుదారానుతింపంగ నేనెంతవాఁడౌదు నీలాంబరా! యో
మహా వీరశూరా! సుధీరా! సుసారా! సుభాకార! రక్షించు రక్షించు రక్షించు
మమ్మా నమస్తే నమస్తే న్నమః

భీష్మ—హే బలదేవా! గాంగేయుఁడిదే నమస్కరించుచున్నవాఁడు.

కవి. జయ జయ హే బల చక్రధరాగ్రజ! చక్రధరాత్మజు సాయుగతిన్
స్మయహరణా యిదె చక్రధరప్రియు చక్రకరార్చను చక్రిపదా
శ్రయుఁడనునై భువి చక్రము నేలుచు చక్రి సఖుండగు చక్రిని వే
సయిరణ తాలిచి శక్ర సురాసుర సన్నుత కావుము సక్రమతిన్.

బల—ఓహో! భీష్మద్రోణులారా! ఇటేల వచ్చితిరి?

దుర్యో—దేవరవారి సందర్శించుటకై యేతెంచినారము.

బల—ఓహో! నీతో ప్రశంసింపలేదె. (నిందాగర్భముతో) తమరు రాజాధి రాజులు
మేము గొల్లవారము. మాదర్శనమేమిటి మీయట్టి వారుచేయుటేమిటి? ఆహా!
చిత్రము.

ఉ. జౌజ సరూప విగ్రహుల హోయనసా యసహాయ శూర వి
భ్రాజిత దండశాసన ధరాధిపు లుగ్ర బలాఢ్యులైన రా

రాజులదేటి? వారికి కిలారులు జీవము నల్పునట్టి గ
వ్యాజక మెపు మేఁపుకొను వారల చుట్టరికంబు కూడునే.

సాత్య—(పరిహాసముగా) గురువరా! గాంగేయా! ఈరారాజు, ఈచక్రవర్తి, ఈ సార్వభౌముఁడు, ఈసర్వంసహాయందు వసించు రాజన్యుల మకుటంబులు పాదపద్మంబున దాల్చుమేటి, మనకందఱకు కిరీటమైన రాజ రాజును నిటలంగాలి నడకను గొనివచ్చితిరి. కొంపదీసి మాతో బాంధవ్యమునకాయేమి? కాదు. ఏమన:-

ఉ. యాదవులెన్న పాదుకల హా! భువనాధిపులైన కౌరవేం
ద్రాదులహో? మూర్ధముల్ యగుఁగదా? యదు సంతతి తోడ బాంధవం
బాదట కౌరవుల్ సలుపుటయ్యది పాదుక లెత్తి మూర్ధమం
దాదర మొప్పఁదాల్చుటయె యందున లోకులు క్రీడ సేయరే.

భీష్మ—ఓయీ! సుయోధనా! సాత్యకి పలుకులనుబట్టి విచారింపగా వ్యాపారముచాల వఱకు మునుకఁ బెట్టినట్టుగాఁ దోచు చున్నయది.

ద్రోణ—ఓయీ! రారాజా! నీవుగురుధిక్కారము చేసి నట్టుగా బొడఁగట్టు చున్నయది. గురుధిక్కారమునకు బాప పరిహారము లేదు. అయినను నామహనీయుని శాంతచిత్తునిగాఁ జేయుటకై చరణంబులపై వ్రాలి క్షమాపణ కోరుకొనుము.

దుర్యో—చిత్తమట్లనే యొనర్చెదను. హా హలాంకా! గురువరా!

చ. గురువర! నన్నదాలమున గోవిదుగా నొనరింప విద్య స
త్కరుణ నొసంగి శిష్యునిగ గైకొని నట్టుల నాదుపట్టియై
వరలు సలక్షలక్షణను బాలిక కోడలిగా గ్రహించి మ
ద్వర జననంబు సేయఁగదె పావనమున్ క్షమియించి దేవరా!

(అని పాదములపై నొరగును)

బల—(కోపముతో) అరే మూర్ఖా! ద్విపాద పశూ!

కం. మగవాని కాని సుతునకు, మగువా నీసుతను పెండ్లి మనమున జేయన్
దగనెంచుట తెగువెంచుట, తగవెంచుట, యిసి తగురా నగరా?

(అని కిరీటముఁదన్ని) ఓరీ! తులువా! (అని చెలరేఁగి)

ఉ. కర్ణ పిశాచ మేది? అది కట్టిన సైంధవ ఘోటుఁడేడి? దు
ర్వర్ణ వివర్ణయా శకుని పక్షి యదేకడ పాఱె? శల్య సం
పూర్ణ కుమాపి శల్యుఁడెటు పోయెనో? యేడి యుగంధు రాడు నీ!
చూర్ణము క్రింద దంచెదను చూపునకైనను కానరాదుగా.

సాత్య—దేవా! వారలు క్రియలో శూన్యులని నేఁటిదనకలోనే మఱవి చేసియుంటిని. రారాజునకీ పరాభవము చాలు. ఏమంటిరి?

సీ. మొదటి బింకమువీడి తుదకు సిగ్గునుజంపి, బిర బిర మనచెంత కరుగు టొకటి
సగము జచ్చి యతండు మగువ నిచ్చెదనంచు, కట దేహి యని వేడు టదియ రెండు
ధరపైన గలరాజ వరులుచే నతినొందు, రాజు పదములందొరగుట మూడు
అట్టి వాని కిరీటు మావలపడేటట్టు, లటె నెమ్మ కాలఁ దన్నుటయు నాల్గు.
తే. గీ. ఈపరాభవములు చాలు, నింకమీఁద
శాంతి నొంది క్షమింపక సార్వభౌము
ననఘు విడచి పుచ్చిన తప్పు మనదె యగుగ
గాన యంగీకరింపుమో కన్నెఁగొనఁగ.

బల—తమ్ముఁడా! మనకాతనితోఁ బనియేమున్నది? మన కుమారునివలచినది లక్షణ. లక్షణయే మనకుఁగావలయును. అంతియెకాదా? ఆర్యులగు భీష్మ ద్రోణులారా!

భీష్మ—ద్రోణ—చిత్తము. మన వస్తువే మనకు ప్రధానము.

బల—(ప్రసన్నవదనుఁడై) ఏమీ! మాటాడవేమి? రారాజా!

దుర్యో—చిత్త మట్లనె?

బల—మరల మరల తగాయిదా సేయవుకదా? కన్నె నొసంగుటకు? ఏమో? నీపలుకుల యదార్థ మెవరుకనఁగలరు? ఇప్పటికి సయ్యని రేపటినుండి యథాప్రకారముగా మొదటికి వత్తువేమొ? ఎట్లన?

ఉ. లక్షణ, రూపయౌవన సలక్షణ, సద్గుణ బుద్ధిచాతురీ
లక్షణ, రాజ రాజనుత లక్షణ, యిట్టిది యేమి? చాలు గో
రక్షకుమారుకేమి? యువలక్షణు కేమిటి? పెండ్లిసేయ మా
లక్షణ నంచు నీహాలము లాగిన పిమ్మట నూరకుందువో.

సాత్య—అగ్రజా! మన మొదటవిద్యకు మోసము లేదుకదా? ఈసారి యాతని నోటి వెంబడి యవక తవక నుడులువచ్చినచో హస్తినాపురమును తలక్రిందుచేయుదము. ఈసారి క్షమించి నీలాంగుల మూఁడఁబెట్టుకుము.

దుర్యో—దేవా! నన్నేల నిందించెదరు? ఇప్పుడే కొడుకును గోడలిఁబిలిపించి మీసమక్షమందే వివాహము గావించెద.

భీష్మ—ద్రోణు—ఓయీ! రారాజా! నీయోచన చక్కగా నున్నయది. మేము వెడలి వధూవరుల నిద్దఱి నీభార్యతో నదంబుపైనిటకు బంపించెదము. (భీష్మద్రోణులు నిష్క్రమింతురు)

(తెఱలో)

ఎక్కడ మా బలదేవాగ్రజుఁడు?

సాత్య—అగ్రజా! మన చిన్నన్నగారి కంఠధ్వనిగా నున్నయది.

(ప్రవేశము కృష్ణ రుక్మిణీ జాంబవతులతోటి)

కృష్ణ—అగ్రజా! నమస్కారము.

బల—స్వస్తి. తమ్ముండా! అంతఃపుర జనంబుతో నేతెంచితి వేమి?

కృష్ణ—మన జాంబవతేయుని పరిణయంబునకై.

సాత్య—త్రికాల వేదియగు మాయన్న యెఱుంగని సంగతి కలదా?

దుర్యో—బావగారికిదే నమస్కారము. చెల్లెండ్రనగ్రజుండిదే స్వాగతమనుచున్నవాండను.

(ప్రవేశము సాంబుండు, లక్షణ, భానుమతి)

సాంబ—ఓహో! నాయనుంగు జననీ జనకుల కిదే నమస్కారము.

లక్ష—అత్త మామలకు వందనము.

భాను—నాథా! ముఖ్యులు వచ్చియున్నవారు. స్వయంవర పద్ధతిగా కన్నెనిచ్చి వారల సంతోష పెట్టవలసినదిగా మీయర్ధాంగి యభిప్రాయము.

దుర్యో—చెలీ! అటులనే కావింతము (లక్షణ కరముంబట్టి సాంబునితో) ఓయీ! జాంబవతేయ!

ఉ. పెంచితి గారవంబునను విద్దెయు బుద్ధులు జ్ఞానమాది నే
ర్పించితి, పెద్దదాని గొనరించితి నీవయి నీకుంగూర్మి న
ర్పించితి, ధర్మపత్నిగ గ్రహించి దయుంచి సహించి యేలు, వ
ర్తించుత వాజ్ఞ చేకొని వరించిన దోట మఱింత బాళిచేన్.

అమ్మా! లక్షణా! నీభర్త యెడ:—

ఉ. కార్యములందు దాసిగతిగా, సలహానిడ మంత్రిరీతి, సౌం
దర్యమునందు రంభక్రియ తాల్మికి ధాత్రి తెఱంగు, భోజ్య సౌ
కర్యముంగూర్ప మాత, పడకందను వేశ్యవలెంచరించి, యా
చార్యముతోడం గీర్తిమ తాన్చుము పుట్టిన మెట్టినిండ్లకున్

ఓయీ! సాంబకుమారా!

ఉ. నీవొక కల్పరాజమువు నీశ్రితమై యలరారు మల్లె పూ
తీవియ యీలతాంగి యిక దీని సమాగమ సౌఖ్య సంపదల్
జీవను భాగ్యకర్తవు సుమీ? యికం కష్ట సుఖంబు లీవయిన్
గ్నవె, తలంప భార్య పతి కెందున నర్ధ శరీరి యాటచేన్.

ఇంక నా భారము తగ్గినది. కన్నె చెఱ వదలినది. ఇదే పరిగ్రహింపుము. (అని లక్షణ కరమును సాంబుని కరమందిడును)

(తెఱలో భేరీ మృదంగ వాద్యములు)

భాను—సాంబకుమారా! నామనవి కూడా యాలింపుము.

కం. గోలసుమీ, సంసారము, జేలసుమీ వడిగఁ బాడ జెంజేల సుమీ
బాలసుమీ వయసునకిది, యేలీలను నేలుకొనెదో యేమన కుండన్.

రుక్మి—(పరిహాసముతో) ఓహో! వదినగారు పాపము కూఁతురేమియెఱుంగని ముద్దరాలని కాఁబోలు నా మోలు కన్నియలను నల్లుండ్రకప్పగించు చున్నటులఁ గున నప్పగించు చున్నయది. ఏమీ?

ఉ. గోలట! సైంధవాదులను గోలనిపించె రణంబులోన పో
టేలట! శల్యకర్ణులను జేవ్వడఁజేసెను మాటలందు నే
బాలట! షోడశాబ్దయుత బాల్యదశందున నుండ, నేల దే
లీలన? ఇద్దిలీకు నవలీలగ జిక్కఁదటంచుఁ బల్కఁగే.

జాంబ—వదినా! మాయక్కగారివచనంబులు వింటివా? తిరిగి నీమాట నీకేయప్పగించిరి. "ఇట్టిదియగు నీకూఁతురేమిటి నాకుమారునితోఁ గాపురము చేయఁజేమిటి" యని భావము స్ఫురించు చున్నయది నిజమే? ఏమంటివా?

తే. గీ. గరిడి తీరిన యోధుంది కాకయున్న
నడికి రేయిని యిలుఁబాసి వనుపు కాని
యరద మెక్కించుకొని పోవు టరయఁ గన్న
వారికిని విన్నవారికి బ్రంబుకాదె?

లక్ష్మ—(స్వగతము) ఓహో! మాయమ్మగారొక్కఁటైరై మాయత్త గారల కిర్వురకును జవాబు చెప్పలేక యున్నగి కానిమ్ము నేజవాబిచ్చెద.

(ప్రకాశముగా) ఈలాగున నీవియ్యపు రాండ్రకు బదులు వచింపుము.

తే. గీ. పట్టపగలందు కనచుండ బంధులెల్ల
వరుని దప్పించి రథమెక్కఁ టరిది యదియొ?
యర్ధరాత్రిని యిలుఁబాయు టర్హ్మియరిదో?
అడుగు మదిగాక సహజమౌ యావని యందు
అత్తపోలిక కోడలి కబ్బనమ్మ.

కృష్ణు—చెలీ! రుక్మిణీ! ఈసారి జవాబిమ్ము నీకోడలకు. లక్షణా! మంచి బాగుగా వచించితివి.

భాను—వదినెలారా! మాలక్షణ యెన్ని వచించిన నేమి? మీరత్తగారలగుటచే మీ మాటయే మీదు. లక్షణా! ఈసంగతి వినుము.

ఉ. అత్తల మామలన్ మఱఁదు లాప్తులు బంధులు మిత్రులాదిపై
బత్తినిగల్గి నీవు భయ భక్తులతోఁ జరియించి భర్తకెం
జిత్తమునిచ్చి యెప్డు పతిసేవయొనర్చుచు నెల్లవారితో

అత్తిమెలంగి జేయుమను హాయిగ గాపుర మొప్పుతోడుతన్.

దుర్యో—ఆర్యులారా! వియ్యంకులగు రామకృష్ణ సాత్యకులారా!

ఉ. కోడలు నూనుదారగద కూతురు మీశశిరేఖరీతి. కా
పాడగదయ్య! ప్రేమమెయి బాగుగ జూడగదయ్య! యేమ తెం
గ్గాడిన మందలించి దయఁగావఁగదయ్య! వెయేల గట్టిగా
పేడెదనయ్య! మిమ్ములను పేవిధముల్, కనిపెట్టి యేలగన్.

(అని రామ కృష్ణ సాత్యకుల కరంబులందు లక్ష కరముంచి) ఆర్యులారా! నాకడసారి నుడి వినుండు.

ఉ. తిట్టగలేదు నిక్కముగ తీవ్రపు గోపము వచ్చినన్నరే,
కొట్టగలేను హాస్యమున కొక్కపుడైనను వేయియేల? నే
గట్టిగ మందలించెదుఁగ కన్నెఱ జేసి కనంగలేదు, నే
నిట్టుల పెంచితీపయిన నెట్టులఁ జూతురో భార మీయదే.

(లక్షణకను విడిచిపెట్టును)

బల—ఓహో! బావగారి బెట్టుసరి యేమై పోయినది.

సాత్య—అగ్రజా! ఆడుపిల్లలు కలవారి కందఱ కీపాటు లున్నవియే.

కృష్ణ—రారాజా! నీకూఁతురు విషయమై మాతో నంతగాఁ జెప్పవలెనా?

దుర్యో—మీరలు లోటు చేయుదు రనియా? కన్నకడుపగుటచే నట్లంటిని.

సాంబ—మామా! కట్నమేమయినా కలదా? లేక నీకూఁతురే కట్నమా?

దుర్యో—లేకేమి వినుము.

కం. నూటొక్క వెయి పదారులు, హాటకపు మొహరు లొసఁగితి యల్లునకును నే
దీటుగ కట్నముక్రిందను, పాటించి కొనంగదయ్య బలహారులారా!

కం. అరదంబు లారువేలును, ద్విరదంబులు రెండువేలు వీతులు పదివేల్
అరయ వెయిదాసదాసీ లిరువుగనరణంబుక్రింద నిచ్చితి కొనుఁడీ!

జాంబ—అన్నయ్యా! సుయోధనా! మీయల్లునికి కట్నము లిచ్చి సంతోషపెట్టుట యేనా? మాకు వియ్యపురాండ్ర లాంచనము లున్నవా? లేవా?

దుర్యో—అమ్మా! మీవియ్యంపురాండ్రైనమందుగురులో నొకరొకరికి

కం. అయ్యారె బంగరు కాసులు వెయ్యిన్నూటపదియార్లు విధిగ నొసఁగితిగా
నయ్యావిరె లాంచనంబులు వియ్యఁపు రాండ్రలకుఁ గొనుఁడి వేరువలుకకన్.

భాను—వదినలారా! మీమీ లాంఛనములు మీకుమారునికి కట్నంబులీయమని మమ్మలను దండించి వసూలుచేసుకొనుటయేనా? మాలక్షణకు నగలేమయినయొసగుట కలదా?

రుక్మి—ఆ ఎంతమాట? నీకుమాత్రకు నగలే లోటువచ్చునా? ఇదిగో విను—

ఉ. ఆదివిరాట్స్వరూపుఁడగు నాహరి కూర్మి సుతుండు ప్రేమమై
నీదు హితైన లక్షణకు నిక్కముగా ప్రియభర్తయౌట కం
టేదిక భాగ్యమీ జగతి యీనగకంటె నమూల్యమైనవే
రేదయినన్ నగున్నదే? వరించినవాడు లభించుటే నగౌ

భాను—ఇది నాసుత కేనా? తక్కినవారలకు జెల్లునా? భగవంతుని నందనుఁడే నానందినికి వరుఁడౌట మాత్రమున నమూల్యమైన యాభరణముగాగా కేవలము భగవంతుఁడే మీకు కాంతుఁడౌటచే నాతఁడు మీకు నిలువు తొడవే యగు.

జాంబ—వదినా! ఎందులకీ తుచ్ఛంపు నగలు. ఏమంటివా?

సీ. నాగర మణిరేఖల నాణెమా పతిభక్తి శిరమున దాల్చెడు గరితలకును
జూమికేలు దుద్దులు జమయేమి? సదుపదేశము చెవులను బెట్టుచానలకును
నత్తు బేసరులివి యెత్తువచ్చునె? కోపమును ముక్కునిడనిట్టిముగ్ధలకును
కట్టుకాసులపేరు పట్టిపి యగు భూతదయగల హృదయములో తరుణులకును
మురుగలుంగరములు సరియౌనె? దానకంకణము చేతులదాల్చు కాంతలకును
మువ్వలొడ్డాణంబు పురుడౌనె? పనిజేయ నడుముబిగించెడి పడతులకును
అందెలు కడియములందమే? న్యాయపథానువర్తనులైన యబలలకును
తే.గీ. పలువిధంబుల నగలేల నిలువు తొడవు
తృప్తియనునది కలదేని తెరవులకును
భువిని విద్యాధనముఁగల పొలఁతులకును
చిక్కనీ నగ లదిపున్న చిక్కవెపుడు.

దుర్యో—నూతన దంపతులారా! మీజననీ జనకులకు మరల నమస్కరింపుఁడు.

లక్ష—సాంబ—చిత్తము. (అని అందరకు నమస్కరింప దీవింతురు.

బల—అమ్మా! లక్షణా! నీకేమికావలయునో కోరుకొనుము)

లక్ష—మామా! మీయట్టి వారలకుఁ కోడల నౌటకంటే నాకేమి కోరికకలదు. సాయందు దయయుంచి హస్తినాపురము రక్షింప వేడెద.

బల—నాప్రతిజ్ఞ నెఱవేఱినది. కావున నీకోర్కె నెఱవేర్చెద.

కం. ఈరోజు లగాయితుగా నోరవి కరిపురమ! దక్షిణోత్తరదిశగా
సీరిసరు నాజ్ఞగైకొని ధారుణిపై నేటవాలు తనమున్ గొనుమా.

ఇదిగో లాంగలమూడ బెఱుకుచుంటి (అని నాగలిని దీసివేయును)

లక్ష—(కృష్ణునితో) మామా! ఇట్టిపెన పెద్దలీగతిగా కన్నియల పరిణయంబొనర్ప వేడెద.

చ. సిరికలవాఁడటంచు, పరి పేరున చుట్టపుటంచు, వావి మే
నరికమటంచు వేనెఱవు నందనుకూలముగాని కాని పెం
డ్లిళవుగఁ జేయుకంటె కులహీనుఁడునైన దరిద్రుఁడైన నా
తెలికమెకాని కన్నియకు దీటగువానినె చూచ్చిగావలెన్.

# ప్రతిజ్ఞా యాదవము

## అనుబంధము

(కుమారజయద్రథుఁడు సాంబునికడ్డుగా వెడలి పాడెడు పాట)

1 కమాచిరాగము—ఏకతాళము

అంధుఁడా దుర్మదాంధ—బంధువానికో
అంధమున నటుమటించి కూడఁ గైకొనక॥

1 బంధమందు వైవకను—బాసి నేనియుక.
సింధు నరేంద్రాత్మజుఁడ—యేను గానురా॥అంధు॥

2 బంధురాంగి ననుఁగోరు—భామ సీగతిక
బాందఁగోర సాంబుడ మృతి—నొందఁ గోరుచే ॥అందు॥

(లక్షణ కుమార జయద్రథునిపైఁ బాడెడు పాట)

2 సింధుకమాచి—చాపుతాళము.

ప. నాచెలీ! నాప్రియా యంచు బల్కెదవు మూఢ!
నాన యది గనక॥నాచె॥

అ.ప. వాచాట యిటులనిబల్క కాచాటుగాజని మూర్ధంబున
కొంగువైచు కవలకేగు నిలువకిట ॥నాచె॥

(సాంబుని యరదంబునకుఁ గర్ణుఁడడ్డుగాజని పాడెడుపాట)

3 బ్యాండుట్యూను.

కర్ణు. ప. సాంబ సాంబ దుర్మదాంధ నిశను నిదురనుండన్ నా
యంబుజాక్షి నెటుక్ అటుమటించితౌరా ॥సాంబ॥

అ. ప. డంబుడాబున్ డాంబికా కాంచన్ మార్గమధ్యమందునే
అడ్డినాడె యంగభూపా లెదిరిచెట కేగదో ॥సాంబ॥

సాంబ. కర్ణభయమె గోకర్ణ మదించినలంబకర్ణ పో
కర్ణుఁడ కర్ణుఁడ నంచును బల్కెదో దూరనెకర్ణమునఁదింకన్

లక్ష. అంగ్రపాలక! ఆగ్రహ మొందక నాత్మజపలుకులు కాంచఁగఁదె

కర్ణ. ఆఁ మాఁడు.

(లక్షణుండు గజముపైఁ బ్రవేశించి పాడెడుపాట)

4 సింధుకమాచి—చాపుతాళం.

ప॥ సాంబుడా సాంబుడా నాకునాజ్ఞ నవదాఁటియరిగెదెచటికో ॥సాం॥

అ. ప. కుంభినిగల నృపతులెల్ల గంభీరులైనను నాయాజ్ఞలను దాఁటఁబోక

తలదాల్చి నడువవలెన్ ॥సాంబు॥

(లక్షణకన్య లక్ష్మణునిపైఁ బాడుపాట)

మోహనరాగము—ఏకతాళము.

ప. అన్నా! లక్షణా! ఔదీపు పితకున్ వెన్కన్ బిరవో॥అన్నా॥

అ. ప. ఆకారణమునన వినాకున్ జననాయది బాధ్యత కనుకన్

యీజాంబవతేయుఁడెంకన్ ॥అన్నా॥

జోడునాకుఁగాడనిమీరే యాడినేనివెంటనిస్తే

నీయభమునునెక్కి వేగన్ శుభమంచును కదువచ్చివత్తున్ ॥అ॥

(లక్షణ శకునిపైఁబాడుపాట)

6 హిందుస్థానిరాగము.

ఈతనినే వరియించితి నీతనినే గోరితి గనుకనువిధిగా

యీతఁడె నాసన్ప్రీతగుమగఁడగు కౌగలిడుదు వే వే వే

ఈతనిచెక్కిలి గొనిచక్కగ నాతమిదీరగ పలుమారున్

భూతలనాథాతతముగ ముద్దాడెదనో హా హా హా

మాతలపేటికి నీతరమగునా యీశరిమును నాపగనిట

తాతానీ తాతకడన్ తగవానరింపగపోపోపో॥

సాంబు. అక్షములాగోరతుకుమారుని కక్షనెదిర్చిన శరముల

రక్షలనేయీ శిక్షనుబాందెదు లక్షణవేగుము సీసీసీ॥

(రెండవసారి కుమారజయద్రథుండర్జునప్పుడుపాడినపాట)

7 ముఖారిరాగము—ఆదితాళము.

లక్షు. కొంకుజంకె గాంచి లక్షణ మదిజంకునే ఖలా పక్వాడింగను
నర్తుకరి పట్టణమున క్షిప్రహా॥

కుమా. భామరో! నీశరీరమటులో నాంబీాదకరగునెచాల్
యేమిది? రానివచ్చిననన్నలచుట యేపాటి భయమహో॥

లక్షు. ఆసనుగొన నెంచినటి పిశాచమావలన్ బరుగిడునటులన్
వాసిగబాణాళి గుప్పి నొంతు

సాంబు. ఓ చెల్వ నొంపనా? నొంపెద పీవ

కుమా. పూర్ణచంద్రబింబాశి కాముబాణ మయ్యెనుజాణనాగయాన!
ఆహా ఆహా
కాముకుండౌసాం బున్నలంచును సరి సరి ననునొంచునా

(కర్ణ శల్య శకుని భూరిశ్రవాదులు కలసిపాడెడుపాట)

8 బ్యాహాగు రాగము బ్యాండుట్యూన్

ప. దడదడదడద బర్వడనిచ్చెదు రథమడలుచు మమగని వగగొనుచున్ ॥దడ॥

౧. ప. వడిగలవాడవె గండరగండవె,పోటుమగడవె హైనయెడన్ ॥దడ॥ తడయకనో వెడగరదం బాపినచో గురిపింతున్ వడివడ యమ్ముల వర్షము పరుగిడి ద్వారక కప్పుడు చూడవలెన్॥

(బలరామ కృష్ణ సాత్యకుల ప్రతిజ్ఞ)

9 బేహాగు రాగము—ఏకతాళము

బల. వారణపురమున్ హలంబునన్ నీరములోనికిఁ ద్రోయనెకో
కొడుకుగోడలినిటా విడువకుండినన్॥

సాత్య. కురుకులజుల పొంకమునే దురమున మరియింకఁ జేతు

వదలకన్ నాపుత్రిసిన్ తనతనయితో గలుపకున్న చో॥

కృష్ణ. వినుముచక్ర ధరుసిపట్టి అలఘుచక్ర ధరునితనయి కివ్వ కున్న

చక్రబధ్యుండవమె నంచెుచనౌను॥

(సాంబుడు చెఱలో నుండగా లక్ష్మణ నానిచెంత పాడుపాట)

10 చక్రవాకరాగం—ఏకతాళము

లక్ష్మ. గరళముకలుగదె ఖడ్గములేదా

కరవాకొ త్రాటికి దేవా

దొరకనియెడలపో కూపములుండవె

సరసులు కలుగవె దేవా

మనమునవెట్లనె ప్రాణమువిడవగ

వలెననుగోరిక దేవా

జనియించంగనె వనజనయనకును

జఱుగకతీరునె దేవా.

